Ci




సంపుటి: 3 సంచిక: 7 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 డిసెంబర్ 2017



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhra Pradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-2017

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్లో చదువుతున్న పిల్లలు.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

అశోక్ : 9963571510

మల్లికార్జున: 9000453887

K RSA10 1 M 125






## విషయ సూచిక





ముఖచిత్రం: లెక్కల లోకం
చిత్రకారుడు: అడవి రాముడు

కొత్తపల్లి 95 వ పుస్తకం!



నిందంతు నీతి నిపుణా యది వా స్తువంతు
లక్ష్మీ: సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ ।
అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయ్యాత్పథ: ప్రవిచలంతి పదం న ధీరా:॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

నీతి ప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందింపనీ, మెచ్చనీ,
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ, గాఢంబుగా సాగనీ,
ఘాతంబప్పడ పొందనీ, నియతి మైగానీ, యుగాంతంబునన్
నీతి శ్లాఘ్యపదంబు దప్పరు గదా నిత్యంబు ధీరోత్తముల్

భావం: పండితులందరూ మెచ్చుకున్నా-తిట్టినా; సంపదలు వచ్చినా-పోయినా; పని ప్రారంభించిన క్షణానే మరణం సంభవించినా-లేక అనేక యుగాల తర్వాత మరణం వచ్చినా- ఏం జరిగినా సరే, మంచివాళ్ళు న్యాయమార్గాన్ని వదిలి ప్రవర్తించరు. అంటే ఎప్పుడూ న్యాయ పథం లోనే ఉండాలని భావం.

# 1729 కథ

"ఒరే, పిల్లలూ! మూడొకట్లు హెచ్చిస్తే ఎంతొస్తుందిరా?" అడిగాడు తాతయ్య.

"మూడొకట్లు మూడు" అన్నాడు సురేషు. వాడు తెలుగు మీడియం ఒకటో తరగతి.

"త్రీ- వం జా- త్రీ" అన్నది స్మిత. తను ఇంగ్లీషు మీడియం ఒకటో తరగతి.

"అది కాదమ్మా నేను అడిగేది! మూడు ఒకట్లను మల్టిప్లై చేస్తే ఎంతొస్తుంది?" అడిగాడు తాతయ్య.

"ఓహో, $1^3$ కావాలా?! 1x1x1 = 1 " అన్నాడు రవి. వాడు ఎనిమిదో తరగతి.

"అవునవును. మా చిన్నప్పుడు దాన్ని 'ఒకటి ఘనం' అనేవాళ్లం! మరి $2^3$ ఎంత?" అడిగాడు తాతయ్య మళ్లీ.

"ఆరు!" అరిచాడు సురేషు

"కాదురా! రెండు రెళ్లు నాలుగు, నాలుగు రెళ్లు ఎనిమిది! సమాధానం ఎనిమిది!" అన్నాడు రవి.

"సరే, మరిప్పుడు మీరంతా పదిహేను వరకూ అంకెల క్యూబ్‌లు రాయండి!" ఆదేశం ఇచ్చాడు తాతయ్య.

$1^3 = 1 \times 1 \times 1 = 1$

$2^3 = 2 \times 2 \times 2 = 8$

$3^3 = 3 \times 3 \times 3 = 27$

$4^3 = 4 \times 4 \times 4 = 64$

$5^3 = 5 \times 5 \times 5 = 125$

$6^3 = 6 \times 6 \times 6 = 216$

$7^3 = 7 \times 7 \times 7 = 343$

$8^3 = 8 \times 8 \times 8 = 512$

$9^3 = 9 \times 9 \times 9 = 729$

$10^3 = 10 \times 10 \times 10 = 1000$

$11^3 = 11 \times 11 \times 11 = 1331$

$12^3 = 12 \times 12 \times 12 = 1728$

$13^3 = 13 \times 13 \times 13 = 2197$

$14^3 = 14 \times 14 \times 14 = 2744$

$15^3 = 15 \times 15 \times 15 = 3375$

వెంటనే పిల్లలంతా లేచి కాయితాలకోసం పరుగెత్తారు చివరికి వాళ్లంతా రాసింది ఈ పైన ఉంది.

"బాగుంది బాగుంది." మెచ్చుకున్నాడు తాతయ్య.

"సరే, ఇప్పుడు చెప్పండిరా, చూద్దాం: '$1^3 + 2^3$ ఎంత?"

"ఒకటికి ఎనిమిది కూడితే వచ్చేది, తొమ్మిది!" అరిచారు పిల్లలు.

"సరే సరే! యీ తొమ్మిదినే మరో రెండు క్యూబుల మొత్తంగా చెప్పండి చూద్దాం!" అన్నాడు తాతయ్య, ఆ కాగితం ముందు వేసుకొని.

"ఎట్లా వస్తుంది తాతయ్యా! రాదు! $1^3$కి $3^3$ కలిపినా 28 వచ్చేస్తుంది కదా! తొమ్మిదిని దాటి పోతుంది" చెప్పేసింది సింధు. సింధు ఇప్పుడు పదో తరగతి. తను లెక్కలు బాగా చేస్తుంది.

"అవునవును- మిగతావి ఏవి కూడినా తొమ్మిదిని దాటిపోతై" అన్నాడు రవి.

"సరే, కానియ్యండి- అయితే ఈసారి మరో పని చేయండి: $7^3 + 6^3$ ఎంత వస్తుంది, చెప్పండి?!" అడిగాడు తాతయ్య.

"216+343=559" చెప్పింది చంద్రకళ, తను రాసుకున్న కాగితం చూసి.

"ఒకె. మరి యీ ఐదొందల యాభై తొమ్మిదిని తెప్పించండి, వేరే క్యూబ్‌లు ఏవైనా రెండింటిని కలిపి! ఇదే ఇవాళ్టి ఛాలెంజ్!" అన్నాడు తాతయ్య.

పిల్లలంతా రకరకాల అంకెలు వేసుకొని కూడారు; కానీ ఎవ్వరికీ సమాధానం దొరకలేదు.

"ఇది కూడా రాదు - పో, తాతయ్యా! *రెండు క్యూబులు కూడితే వచ్చిన అంకె, వేరే ఏ రెండు క్యూబులు కూడినా రాదు !*" అన్నది సింధు.

"వామ్మో బలే సిద్ధంతం చెప్పేసావే! కానీ తప్పు. కొన్ని అంకెల్ని అట్లా రెండు క్యూబుల మొత్తాలుగా- రెండు రకాలుగా- రాయచ్చు! ప్రయత్నించి కనుక్కోండి!" అన్నాడు తాతయ్య నవ్వుతూ.

కొద్ది సేపు కష్ట పడ్డాక, రవి అడిగాడు "ఇది చాలా కష్టం తాతయ్యా! ఎన్ని అంకెలు కూడాలి,

మేం మాత్రం?! క్లూ ఇవ్వు ఏదైనా !"

"సరే, ఆ అంకె ఏదో నేనే చెప్పేస్తాను- 1729. ఇది ఏ రెండు క్యూబులు కూడితే వస్తుందో మీరే కనుక్కోండి" చిలిపిగా నవ్వాడు తాతయ్య, సురేషు కేసి చూసి కన్ను గీటుతూ.

" 1728 కి ఒకటి కూడితే సరి, 1729 వచ్చేస్తుంది!" అరిచేసాడు సురేషు చటుక్కున.

తాతయ్య వాడిని మెచ్చుకుంటూ, "బాగుంది. ఇంతమంది పెద్ద పిల్లలుండగా యీ చిటుకు కనుక్కున్నాడు చూడండి కిటుకు! మరిప్పుడు పెద్దవాళ్ళూ, మీరు చెప్పండి : 1729 ని వేరే రెండు క్యూబుల మొత్తంగా చెప్పండి చూద్దాం!"

రెండు నిముషాలయ్యాక సింధూ కనుక్కున్నది:

“9 క్యూబ్ + 10 క్యూబ్ = 729 + 1000 = 1729!"

"బాగుంది" మెచ్చుకున్నాడు తాతయ్య "మీరందరూ బలే తెలివైన పిల్లలు".

"పో తాతయ్యా! ఊరికే ఇంత కష్టం లెక్కలు చేయించి ఉడికిస్తున్నావు!" మూతి ముడిచింది పద్మ. తనకి 'లెక్కలు రావు' అని పేరు.

"కాదులేవే, ఇంతకీ మీకు 1729 కథ తెలుసా, తెలీదా?!” అడిగాడు తాతయ్య.

"అమ్మో! ఇప్పుడు నువ్వు చరిత్ర పాఠం చెప్పబోతున్నావా, ఏంటి?!" నిర్ఘాంతపోయినట్టు అరిచారు పిల్లలు.

"లేదురా, అంకె కథే. మన దేశపు కుర్రవాడు ఒకడు, లండన్‌లో చాలా పేరు ఉన్న లెక్కల ప్రొఫెసరు గారికి ఒకరికి తను రాసుకున్న చిత్తు నోట్సు కాయితాలను పంపించాడట, చాలా ఏళ్ల క్రితం "అయ్యా! నేను లెక్కలు పెద్దగా చదువుకోలేదు. ఇండియాలో జమ-ఖర్చు లెక్కలు రాసే గుమస్తా పని చేస్తుంటాను. రోజులు సరిగా గడవట్లేదు. ఐతే నాకు లెక్కలంటే చాలా ఇష్టం. ఇదిగోండి, నానోట్సులో నేను సొంతంగా కనుక్కున్న లెక్కలు కొన్ని ఉన్నై. వీటిని

చూసి, నా లెక్కలు కరెక్టో, తప్పో చెప్పండి ప్లీజ్!" అంటూ.




ముందు ఆ ప్రొఫెసర్ దాన్ని చూసి చెత్త అనుకున్నాడు. తర్వాత నిజంగానే ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే అందులో ఉన్నవి ఆనాటి వరకూ ఇంకా ఎవరూ, ఏ గణిత శాస్త్రజ్ఞుడూ కనుక్కోని కొత్త సిద్ధాంతాలు!

ఆ ప్రొఫెసరు- ఆయన పేరు హార్డీ- ఆయన చాలా మంచివాడు. లెక్కలంటే మక్కువ ఉన్నవాడు. ఆయన ఆ కుర్రవాడిని మెచ్చుకొని, "చాలా బాగున్నాయి, కానీ ఒరే, నువ్వు చెబుతున్నవి కొన్ని నాక్కూడా అర్థం కాలేదు, ఇక్కడి కొచ్చి మా కాలేజీలో చేరరాదా, కొన్ని లెక్కలు నువ్వు నేర్చుకోవచ్చు; కొన్ని నేను నేర్చుకుంటాను?! నీకు బాగా డబ్బులు కూడా ఇస్తారు, మా యూనివర్సిటీ వాళ్లు?" అని రాసాడట.

అట్లా వెళ్ళాడట మన రామానుజన్, లండన్‌లో కేంబ్రిజ్ యూనివర్సిటీకి!" ఆపాడు తాతయ్య.
ఓహో! ఇది **శ్రీనివాస రామానుజన్** కథా?!" ఆశ్చర్య పోయారు పిల్లలు.

అవును ఇందాక మనం కనుక్కున్నామే, ఆ అంకె **1729 ని రామానుజన్-హార్డీ నంబర్ అంటారు**" చెప్పాడు తాతయ్య.

"ఎందుకలాగ?!" అడిగింది సింధు.

తాతయ్య చెప్పాడు "రామానుజన్‌కి ఒకసారి చాలా జబ్బు చేసిందిట. చావు బ్రతుకుల సమస్య. ఆ సమయంలో అతన్ని పలకరించేందుకు ఓ టాక్సీ ఎక్కి వచ్చాడు హార్డీ. ఆ టాక్సీ

నెంబర్ అతనికి గుర్తుంది- 1729!

ఆస్పత్రిలో అవీ ఇవీ మాట్లాడాక, అతను రామనుజన్‌తో అన్నాడట, యధాలాపంగా- "ఏంటో, రామానుజన్! ఇవాళ్ల అంతా 'డల్' గా ఉంది. చివరికి నేను ఎక్కివచ్చిన టాక్సీ నెంబరు కూడా 'డల్' గానే ఉంది! 1729. ఎందుకూ పనికిరాని అంకె!" అని.

రామానుజన్ చటుక్కున కళ్లు తెరిచి, నవ్వాడట- "కాదు. అది చాలా ఆసక్తికరమైన అంకె! రెండు క్యూబుల మొత్తాలుగా, రెండు రకాలుగా చెప్పగలిగే సంఖ్యల్లో అతి చిన్నది 1729! అన్నాడట.

తర్వాత హర్డీ లెక్క చూసుకుంటే ఏముంది, అది నిజమే! అర్థమైనాయా, అతని తెలివితేటలు?

అట్లా రామానుజన్ చాలా కష్టమైన లెక్కల్ని తనే సొంతంగా చేసి పెట్టుకున్నాడు. చాలా మేధావి. కానీ పాపం ఆయన ఆరోగ్యం ఏనాడూ సరిగా లేదు. 32 ఏళ్ల వయసుకే చనిపోయాడు. **డిసెంబర్ ఇరవై రెండు** ఆయన పుట్టిన రోజు. దాన్ని మనం **జాతీయ గణిత దినోత్సవం**గా జరుగుపుకుంటున్నాం! ఒరే, శ్రీనివాస రామానుజన్‌ని గురించి మీరంతా బాగా చదవాలి. అట్లాంటివాడు మళ్లీ పుడతాడో, అసలు పుట్టడో!" ఆగాడు తాతయ్య.

"ఎందుకూ?! నేను ఉన్నానుకదా! 1+1728 అని కనుక్కోలేదా, ఒక్క క్షణంలో ?! నేనూ ఆయనంత వాడిని అవుతాను!" అన్నాడు సురేష్, సీరియస్‌గా.

పిల్లలంతా నవ్వారు. "అవున్రా! మీరంతా రామానుజన్‌లయిపోండి. అందరికీ లెక్కలన్నీ సులభం చేసెయ్యండి!" నవ్వాడు తాతయ్య.






# అమ్మమ్మ ఊళ్ళో దావీదు

బిట్టు కథలు

*జరిగిన కథ : ఢిల్లీ లో ఉండే బిట్టు, వాళ్ల అమ్మమ్మ ఊరు పోరంకికి వచ్చాడు. దావీదు అనే పిల్లాడు సైకిల్ రిపేరు చేసి, తాతయ్య దగ్గర ఎక్కువ డబ్బులు తీసుకున్నాడు. దాంతో వాడు బిట్టుకి శత్రువైపోయాడు. కానీ అమ్మమ్మకి వాడి గురించి తెలీదు.. ఇక చదవండి, '..దావీదు''- రెండో భాగం.*

*రచన : శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, విజయవాడ.*

"ఆ రోజు తాతయ్యతో వీడు ఎట్లా మాట్లాడాడో తెలుసా, నీకు అసలు?" అని అమ్మమ్మని కోపంగా అడుగుదామనుకున్నాడు బిట్టూ. కానీ 'ఎవరి గురించైనా అట్లా చెడ్డగా చెప్పటం బావుండద'ని ఊరుకున్నాడు.

'అయినా అమ్మమ్మా, బట్టలు ఉతికేందుకు వాషింగ్ మిషన్ కొనుక్కోవచ్చుగా, వీళ్లతో చేయించుకునేదెందుకు?' అన్నాడు, అమ్మమ్మకి సులువు చెబుతూ.

'ఎందుకురా, మనకు ఎన్నో ఏళ్లుగా బట్టలు కమలమ్మే ఉతుకుతోంది. మనం మిషన్

కొనుక్కున్నామంటే మరి ఆవిడ చేతిలో పని పోతుంది కదా!

అయినా, నలుగురూ ఇంటికొచ్చి వెళ్తూంటే ఇల్లంతా సందడిగా బావుంటుంది- ఒట్టి మిషన్లతో ఏం బావుంటుందిరా?

మీకైతే, మరి సిటీలో బట్టలు ఉతికే మనుషులు కావాలన్నా దొరకరు; దొరికినా ఇంట్లో కూర్చుని ఉతికించుకునే తీరిక కూడా ఎవరికీ ఉండదు- అందరూ ఉద్యోగాలకి పరుగెడతారు కదా; మరి ఇక్కడైతే అట్లాంటి హడావిడి ఉండదు: చాలామంది నాలాగే బట్టలు ఉతికించుకుంటారు' అంది అమ్మమ్మ.

"నలుగురూ ఇంటికి వచ్చి వెళ్తుంటే ఇల్లంతా సందడిగా బావుంటుంది" అని అమ్మమ్మ చెప్పింది బిట్టుకి కూడా నచ్చింది..

"నిజమే..దిల్లీలో అయితే ఎవరి ఇంటికి ఎవ్వరూ వెళ్లేందుకు సమయం చిక్కదు- అంతా బిజీనే! ఎవరి ఇంటికైనా వెళ్లాలంటే ముందు ఫోన్ చేసి, 'ఇంట్లో ఉంటారా?' అని అడిగి, అప్పుడు వెళ్లాలి.

అమ్మ ఆఫీసుకి వెళ్తూ ఇంటిపని చేసే తారా దీదీకి 'చాబీ' (తాళం చెవి) ఇచ్చి వెళ్లిపోతుంది. అమ్మ వచ్చేసరికి తారా దీదీ పని చేసి వెళ్ళిపోతుంది! ఇంక తనతో మాట్లాడేంత తీరిక ఎందుకుంటుంది అమ్మకి?

మరి ఆదివారాల్లో మాట్లాడచ్చుగా అంటే ఆదివారంనాడు తారాదీదీ పనిలోకి రాదు. దాంతో అసలు ఎవరూ ఎవ్వరితోటీ తీరిగ్గా మాట్లాడుకోనే మాట్లాడుకోరు! తనకైతే జావేద్ అంకుల్ ఉన్నారనుకో; కానీ అమ్మకి, నాన్నకి ఎవరున్నారు, రోజూ మాట్లాడేందుకు?...

జావేద్ అంకుల్ కూడా అమ్మని అడిగారట- 'బిట్టు ఎప్పుడొస్తాడు?' అని. ఇక్కడ చూస్తే తాతయ్య, అమ్మమ్మ, తాతమ్మ అందరూ మంచివాళ్లే. అమ్మని, నాన్నని వదిలి ఇక్కడ ఉండాలంటే కొంచెం బాధగానే ఉంటుంది; కానీ ఇక్కడ వీళ్ల దగ్గర ఉంటే తనకు చాలా బావుంటుంది కూడా. అయితే మరి ఈ సంగతి అమ్మకి చెబితే పాపం, తను బాధ

పడుతుందేమో. 'బిట్టూ ఇంక దిల్లీకి రాడు' అనుకుంటుందేమో!

అయినా, రాత్రి పడుకునేప్పుడు అమ్మ తనకి కథలు కూడా చెప్పదు- అమ్మమ్మ అయితే చాలా కథలు చెబుతుంది! అమ్మకి అసలు సమయమే చిక్కదు.. ఈ సారి ఫోన్ లో అడగాలి అమ్మని- నాకన్నా అమ్మకి తన ఉద్యోగం, మొబైల్‌ఫోన్ ఎక్కువ ఇష్టం అనిపిస్తుంది" బిట్టు ఆలోచనలు అట్లా సాగాయి ఆరోజంతా.

"..ఇక్కడ ఉన్నవాళ్ళందరిలోకీ చెడ్డవాడంటే ఒక్క దావీదే. వాడు కూడా మరి, 'నిజంగా చెడ్డవాడా' అంటే.. అంటే.. ఏమో, ఇంతకీ వాడు ఏం చెడ్డ పని చేసాడు? తాతయ్య చెప్పినట్టు వాడు మంచివాడేనేమో..?! అయినా సైకిల్ రిపేర్ భలే చేస్తాడు.. పోనీ వాడికి చదువు నేర్పిస్తే?! చదువుకోవట్లేదని కదా, వాళ్ల అమ్మ వాడిని ఇక్కడ వదిలేసింది?! వాడికి మటుకు ఉండదూ, వాళ్ల అమ్మ దగ్గరకి వెళ్లాలని? తాతయ్యకి చెప్పాలి- 'ఇక్కడ అందరికీ హిందీ, ఇంగ్లీషు నేర్పండి; నాకేమో తెలుగు నేర్పండి అని'.." అనుకున్నాడు బిట్టు.

***

ఒక రోజు ప్రొద్దున్నే కమలమ్మ ఒక చిన్న పిల్లను వెంటపెట్టుకొని వచ్చింది. దావీద్ చెల్లెలట. 'చిట్టి'- పది, పదకొండేళ్లు ఉంటాయేమో.




ఆ అమ్మాయి వాళ్ల అమ్మమ్మ వెనుకే తిరుగుతూ పనులు చేస్తోంది. బిట్టు నిద్ర లేచి కూర్చొని, ఆ అమ్మాయి చేసే పనుల్నే గమనిస్తున్నాడు. 'అంత చిన్నపిల్ల చేత పనులు చేయించకు కమలా' అంటోంది అమ్మమ్మ.

"ఏం చెయ్యనమ్మా, అక్కడ నా కూతురు ఇంటి బరువు మొయ్యలేక కష్టపడుతోంది; అల్లుడా, ఇల్లు పట్టించుకోడు; నాకు ఆరోగ్యం బాగోలేక నీరసం అయిపోయానని, 'నీకు తోడుగా ఉంటుంది- దీనికి కూడా పని నేర్పు' అని పంపింది ఈ చిన్నదాన్ని. ఏమాటకు ఆమాటే చెప్పుకోవాలమ్మా, దీని చురుకుదనమూ, తెలివితేటలూ- మీలాంటి పెద్దవారి ఇళ్లల్లో ఉండాల్సిన పిల్ల!' అంటూ కళ్లు తుడుచుకుంది కమలమ్మ.

'అయ్యో, బాధపడకు. దీన్ని, దావీదుని ఇద్దరినీ చదివిద్దాంలే; మన సారున్నారు, చూసుకుంటారు!' అంటూ ఓదార్చుతోంది అమ్మమ్మ.

బిట్టుకి ఎందుకనో చిట్టి చాలా నచ్చింది. అమ్మమ్మ వెనకాలే చిన్న చిన్న పనులు అందుకుంటోంది ఆ పాప. తాతమ్మకి కళ్లజోడు, చేతికర్రా అందిస్తోంది.

ఆ రోజు సాయంత్రం తాతయ్యతో సైకిల్ మీద వెళ్తుంటే వీరబాబు షాపు దగ్గర దావీదు కనిపించలేదు. 'తాతయ్యా, దావీదు చెల్లెలు వచ్చింది ఈ రోజు. దావీదు ఊరెళ్లిపోయాడా? షాపులో కనిపించటం లేదు?!' అంటూ ఆరా తీసాడు.

'అవునా?! వీరబాబు మరి నాకు ఏమీ చెప్పలేదే?! సరే పద, వాళ్ల ఇంటివైపు వెళ్లి చూద్దాం!' సైకిలును వీరబాబు ఇంటివైపు తిప్పారు తాతయ్య.




బిట్టూ సైకిల్ దిగి, వాళ్ళ ఇంటి గుమ్మం ముందు నిలబడి, 'చిట్టీ' అంటూ పిలిచాడు. ఇంట్లోంచి ఎవ్వరూ రాలేదు గానీ, ఇంటి వెనకనుండి ఎక్కడినుండో పరుగెత్తుకొ-చ్చారు దావీదు, వాడి చెల్లెలు. దావీదు

చేతిలో ఏమున్నదో చూడగానే బిట్టు కళ్లు సంతోషంతో మెరిసిపోయాయి: ఏముంద-నుకుంటున్నారు? ఒక చిన్న- నల్ల- కుక్కపిల్ల!!

దాని మెడకి తాడు కట్టి, చేతిలో పట్టుకొని ఉన్నాడు దావీదు!

బిట్టు ఎన్నాళ్ళుగానో అడుగుతున్నాడు అమ్మని-నాన్నని: "మనం ఒక కుక్కపిల్లని పెంచుకుందాం" అని. ఇప్పుడు ఆ కుక్కపిల్లని చూసాక, అకస్మాత్తుగా దావీదు తన ప్రాణ స్నేహితుడిలా కనిపించాడు బిట్టుకి: 'దావీదూ, నాకు ఆ కుక్కపిల్లని ఇస్తావా?' ఆశగా అడిగేసాడు.

"అలా ఎవరినీ, ఏదీ అడక్కూడదు" అని అమ్మ ఎప్పుడూ చెప్పేదంతా మరిచే-పోయాడు వాడు ఆ క్షణాన. అట్లా వాడు ఆశగా అడగ్గానే దావీదు కూడా ఏమీ మాట్లాడకుండా కుక్కపిల్లని బిట్టుకి అందించాడు.

'రెయిన్ బో! కమాన్!' అని పిలిచాడు బిట్టూ.

'అదేంటి, దాని పేరు మార్చేసావు? నేను టైగర్ అని పెట్టాను, దాని పేరు?!' అన్నాడు దావీదు.

'కానీ రెయిన్‌బో ఇంకా బావుంది కదా? మనందరికీ ఇంద్రధనస్సు చూస్తే బోలెడు ఇష్టం కదా, అలాగే దీన్ని చూసినా అంతే సంతోషంగా ఉందని, అట్లా పిలిచాను. టైగర్ అంటే పాత పేరే కదా!' అది తన సొంత కుక్కపిల్ల అన్నట్టు చెప్పేసాడు బిట్టు.

ఏమనుకున్నాడో కానీ దావీదు చెల్లి వైపు చూసాడు. చిట్టితల ఊపింది 'అవును-రెయిన్‌బో పేరు బావుందన్నయ్యా' అంటూ బిట్టు పెట్టిన పేరుని బలపరిచింది.

తను అడగ్గానే దావీదు అలా రెయిన్‌బోని ఇచ్చెయ్యటం బిట్టుకి చాలా నచ్చింది.

అంతలో పెరట్లోంచి కమలమ్మ బయటికొచ్చి, 'పట్టుకెళ్లు బాబూ! మీరైతే దీనికి పాలు, అన్నం, బిస్కెట్లు పెడతారు' అంది నవ్వుతూ.

'అక్కడ నువ్వు ఏం చేస్తున్నావ్?' అన్నాడు, లోపలేదో తనకి తెలియని విషయం ఉందని

పసిగట్టిన బిట్టు.

కమలమ్మ వాడిని పెరట్లోకి పిలుస్తూ 'ఇలా రా, బాబూ, ఇదిగో, మా గేదెని చూడు, దావీదు దీనికి 'కరీనా' అని పేరెట్టేడు. అంటే ఏంటో నాకు తెలీదు కానీ, 'కరీనా!' అని పిలిస్తే చాలు- మా అమ్ములు- అదే, మా గేదె- పలుకుతుందిప్పుడు' అంది ఉత్సాహంగా.




బిట్టు వెంటనే 'కరీనా!' అని పిలిచాడు. గేదె తలత్రిప్పింది. బిట్టు మళ్లీ మళ్లీ పిలిచాడు. 'అది వాడివైపే చూసింది కొంత సేపు'

'దాని పొట్ట ఎందుకు అంత లావుగా ఉంది?' అన్నాడు బిట్టూ దానివంక పరీక్షగా చూస్తూ.

'మా కరీనా ఈ రోజో రేపో ఈనుతుంది బాబూ, అందుకే...'

'ఈనుతుందా, అంటే....?' అంటే?!

'ఒక బుజ్జి గేదె పిల్ల పుడుతుంది' సమాధానం చెప్పింది చిట్టి.

బిట్టు సంతోషానికి అంతులేదు. ఒక చేత్తో రెయిన్బో గాణ్ణి పట్టుకుని గేదె వైపు ఆసక్తిగా చూస్తూ నిలబడ్డాడు.

"ఈ రెండు మూడు రోజుల్లో ఎప్పుడైనా ఈనచ్చు బాబూ! ఈనిన తర్వాత నువ్వు కూడా వచ్చి మా బుజ్జి గేదె పిల్లను చూద్దువు" చెప్పింది కమలమ్మ.

తను రెయిన్‌బోని తీసుకెళ్తున్నా దావీదు ఏమీ అనలేదు. దాంతో బిట్టుకి దావీదు పూర్తిగా నచ్చేసాడు. రెయిన్బోని ఇంటికి తెస్తూ బిట్టు అమ్మ గురించి కూడా ఆలోచించాడు-

కుక్కపిల్లని పెంచుకుందామంటే అమ్మ ఏమంది? ఎన్ని నియమాలు చెప్పింది?! అమ్మకి క్రమ శిక్షణ ఎక్కువే! 'కుక్కపిల్లకి నువ్వు రోజూ స్నానం చేయించి శుభ్రంగా చూసుకోగలిగితే కొనిస్తాను' అన్నది.

రెయిన్బోని చూసి బిట్టుకి కవిత్వం ఆగకుండా వచ్చేసింది:

చిట్టి, నేనూ, దావీదూ!
బుజ్జి రెయిన్బో మా అందరి నేస్తం!
పరుగుపందెంలో వాడు!
మేడ ఎక్కేస్తాడు చూడు!
మా పాటలు, ఆటలు అన్నీ వాడికే!
బిస్కెట్ ఇస్తే తోకాడిస్తాడు,
మమ్మల్నందర్నీ ప్రేమిస్తాడు,
అల్లరి అంటే వాడే, నేస్తం అంటే వాడే!
దావీదు ఇప్పుడు నా నేస్తం కూడా!

ఆ మర్నాడే కమలమ్మ జున్ను పాలు పట్టుకొచ్చింది. అమ్మమ్మ జున్ను చేసే హడావుడిలో ఉంది. బిట్టు అదంతా గమనిస్తూ అక్కడే కూర్చున్నాడు. అమ్మమ్మకి సహాయంగా ఏలకులు పొడి చేసి ఇచ్చాడు కూడా. అమ్మమ్మ వండిన జున్ను వాడికి తెగ నచ్చేసింది. ఆ తర్వాత దావీదు ఇంటికి వెళ్లి బుజ్జి దూడని ముట్టుకుని కూడా చూసాడు. ఆనందంతో గెంతులేసాడు. ఆ తర్వాత ఇంటికొచ్చి తాతయ్యని, అమ్మమ్మని అడిగాడు- "మనం ఒక గేదెని కూడా పెంచుకుందామా?" అని.

'అది పెద్ద బాధ్యతరా! కావాలంటే నువ్వే ఎప్పుడైనా కమలమ్మ ఇంటికి వెళ్లి, ఆ బుజ్జి దూడతో ఆడుకో! దూడని మనం సరిగ్గా చూసుకోలేకపోతే పాపం, దానికి కష్టం కాదూ?!' అంది అమ్మమ్మ.

"రెయిన్బోని పెంచుకునే నేను బర్రెదూడని ఎందుకు పెంచుకోలేను?' అని కొంచెం ఆలోచించాడు గానీ, తర్వాత 'అమ్మమ్మ చెప్పిందంటే అదేదో చాలా కష్టమే అయి ఉంటుంది' అని అర్థం చేసుకున్నాడు బిట్టు. అట్లా అమ్మమ్మ ఊళ్ళో దావీదు, చిట్టి బిట్టుకు స్నేహితులైపోయారు.

*(తర్వాత ఏమైందో వచ్చే సంచికలో..)*



# కలసి ఉంటే కలదు సుఖం

బొమ్మల కథ

రచన: శివయ్య, 9 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర
బొమ్మలు : పూజిత, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.



అనగనగా ఒక అడవిలో ఓ పెద్ద మర్రి చెట్టు ఉండేది. ఆ చెట్టులో గోరింకల గుంపు ఒకటి ఉండేది. పెద్ద గోరింకలన్నీ పొద్దున్నే బయటికి వెళ్ళిపోయేవి. వెతికి వెతికి, పిల్లలకు నచ్చే ఆహారాన్ని దొరికించుకునేవి. దాన్ని తెచ్చి పిల్లలకు పెట్టేవి.

వాటి తీరును గమనించాయి రెండు గ్రద్దలు.




పెద్ద గోరింకలు ఆహారం తెచ్చేందుకు వెళ్ళగానే అవి మర్రి చెట్టు మీద వాలటం మొదలెట్టాయి. గూళ్ళలో ఉన్న గోరింక పిల్లలను చంపి తినెయ్యటం, మరి కొన్నిటిని గోళ్ళకు గుచ్చుకొని ఎగిరి పోవటం మొదలెట్టాయి.

పిల్లలు కనబడక పెద్ద గోరింకలన్నీ రాత్రుల్లో ఏడుస్తూ కూర్చున్నాయి. ఆ రోజునే ఒక సమావేశం ఏర్పాటు చేసుకున్నాయి.




మరుసటి రోజు తెల్లవారగానే అవన్నీ ఆహారం తెచ్చేందుకు వెళ్ళినట్లే వెళ్ళినై. అక్కడక్కడా నక్కి, మర్రి చెట్టునే గమనించటం మొదలు పెట్టినై. అయితే ఆ సంగతి తెలీని గ్రద్దలు రెండూ కాసేపు ఆకాశంలో చక్కర్లు కొట్టి, చెట్టు మీద వాలినై. మరుక్షణం పెద్ద గోరింకలన్నీ వాటిమీదికి దూకి, అరిచి, ముక్కులతో పొడిచి, రెక్కలతో బాది, వాటిని

అక్కడినుండి తరిమి వేసినై.



తర్వాత అవన్నీ ఆలోచించి, దగ్గర్లో ఉన్న గ్రామంలోకి వెళ్ళినై. అక్కడ ఓ పెళ్ళి జరుగుతున్నది. పెండ్లివాళ్లు వాయించిన తప్పెట్లు, తాళాలలో తాము మొయ్యగలిగినవాటినల్లా గువ్వలు ఎత్తుకొచ్చాయి. కొన్ని పక్షులు తమకు దొరికిన గిన్నెలను, పళ్ళేలను తెచ్చుకున్నాయి.

గువ్వలు ఆరోజు రాత్రి ఒక సంగీత విభావరిని ఏర్పాటు చేసుకున్నాయి. పెద్ద పెద్ద శబ్దాలు ఎలా చెయ్యాలో నేర్చుకొన్నాయి. మరుసటి రోజు ఉదయం గద్దలు ఆకాశంలో విహరిస్తుంటే గోరింకలు క్రింది నుండి పెద్ద పెద్ద శబ్దాలు చేసాయి.

అవి విన్న గ్రద్దలు రెండూ భయపడ్డాయి. "ఎవరో మనుషులు ఉన్నట్లు ఉన్నారు- రేపు వద్దాం!" అని వెళ్ళిపోయాయి.

గోరింకలు చాలా సంతోషపడ్డాయి. మరుసటి రోజున గ్రద్దలు వచ్చే సమయానికి మళ్ళీ అదే తంతు. చివరికి భయపడినై గ్రద్దలు. అక్కడికి రావడం మానివేశాయి. అటుపైన గోరింకలు హాయిగా బ్రతికాయి.

మీకు తెలుసా? మనం 'తట్టు' "అమ్మవారు' అని పిలిచే వ్యాధినే ఇంగ్లీషులో 'రూబెల్లా' అంటారు

# పువ్వులం-పువ్వులం

కవిత

రచన: శ్రీలత, 8 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర




పువ్వులం పువ్వులం
అందమైన పువ్వులం
రంగు రంగుల పువ్వులం
హాయిని గొలిపే పువ్వులం
ఎర్రని గులాబి నేను
అందరు మెచ్చే పువ్వును



కొలనులోని కలువను నేను
దేవుడు మెచ్చే పువ్వును




తెల్లా తెల్లని జాజిని నేను
సువాసన ఇచ్చే పువ్వును




పుసుపు పచ్చని చామంతిని నేను
పడతుల సిగలో పువ్వును




ఎర్ర ఎర్రని మందారాన్ని నేను
అందరికీ ఇష్టమైన పువ్వును

మరులు పెంచే మల్లెను నేను
సువాసన వెదజల్లే పువ్వును







పువ్వులం పువ్వులం
అందమైన పువ్వులం
రంగు రంగు పువ్వులం
హాయిని గొలిపే పువ్వులం



# గుణపాఠం

రచన: చరణ్, 8 వ తరగతి, రిషి వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.

అనగనగా 50 సంవత్సరాల క్రితం 'మేరీ' అనే యువరాణి ఉండేది.

అప్పుడు ఒక రోజున గాలి బాగా వీచింది. మేరీకి చాలా ఇష్టమైన కుండ ఒకటి- క్రింద పడి, పగిలిపోయింది!

దాంతో మేరీకి చాలా బాధ వేసింది. ఆమె హద్దూపద్దూ వదిలేసి వాయుదేవుడిని ఇష్టం వచ్చినట్లు తిట్టింది.

అది విని వాయుదేవుడికి ఎక్కడలేని కోపం వచ్చింది.



తనకి ఓ శాపం పెట్టాడు. 'తను రోజూ మూడు గంటల కన్నా ఎక్కువ సేపు పండుకోకూడదు. అట్లా పడుకుంటే తను ఒక బఠానీ గింజలాగా మారిపోతుంది. అంతేకాదు- తను ఇంకెప్పుడూ సూర్యుడిని కూడా చూడకూడదు. ఎండకు ఉంటే తన రక్తం ఎండిపోయి, తను చనిపోతుంది!




ఆ రాత్రి తను చాలా అలసటతో వచ్చి పడుకున్నది...గంటైంది..రెండు గంటలు గడిచాయి ...మూడో గంట దాటేసరికి ఆమె మెల్లగా, చిన్నగా అవ్వటం మొదలుపెట్టింది. ముదురు పచ్చ రంగుకి మారింది. చివరికి తను పూర్తిగా ఒక చిన్న బఠాణీ అయిపోయింది!

అప్పుడు గాలి చాలా గట్టిగా వీచింది. దాంతో ఆ బఠాణి కాస్తా దొర్లుకుంటూ పోయి బాల్కనీలో పడింది.

అంతలో ప్రొద్దెక్కింది. సూర్యుడు వచ్చాడు.

ఆ తర్వాత కొంతసేపటికి గానీ యువరాణికి మెలకువ రాలేదు. మెలకువ వచ్చాక ఏడుపొచ్చింది. తను బఠాణీ అయిపోయింది అని అర్థం చేసుకున్నది. వాయు దేవుడిని ఊరికే తిట్టినందుకు పశ్చాత్తాప పడింది.

సూర్యుడి వెలుగు వల్ల ఆమెలో రక్తం ఎండి పోవటం మొదలైంది. బఠాణీ కూడా అయిపోయింది కాబట్టి ఇప్పుడు ఇంక కదలలేదు!

ఆమె కష్టాలు చూసి వాయుదేవుడి మనసు కరిగింది.

ఆమె పశ్చాత్తాప పడింది అని ఆయనకు అర్థం అయ్యింది. ఆమెకు తను ఇచ్చిన

శాపాన్ని ఉపసంహరించాడు.



"నన్ను క్షమించు! ఇంకెప్పుడూ నిన్ను తిట్టను. నీ శక్తిని చిన్నచూపు చూడను!" అన్నది యువరాణి.

వాయుదేవుడు తనని క్షమించాడు. "కనీసం ఆమెకు గుణపాఠం లభించిందిలే; ప్రకృతి శక్తుల్ని చిన్నచూపు చూడకూడదని అర్థమయ్యేట్లు చేసాను!" అని సంతోషపడ్డాడు.

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు కూడా పిల్లలే! వాళ్లంతా అనంతపురం రాధా స్కూల్‌లో ఏడు-ఎనిమిది-తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అట్లాగ, అనుకుంటే మీరూ బొమ్మలు వేయచ్చు; మీరూ కథలు రాయచ్చు!

మీలాంటి పిల్లలను కలవటం, వాళ్ల చేత తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, ఇష్టపడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి! ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలుపంచుకోండి. బాగా చదవండి! బాగా గీయండి! బాగా రాయండి! నవ్వండి! ఆలోచించండి! చక్కగా పాడండి! మంచి పౌరులుగా ఎదగండి!

**పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !**




# గుణమే అందం

తెలుగు జానపద కథ

రాజు రాణిని వదిలేసే కథలు మన సమాజంలో వేళ్ళూనుకొని ఉన్న పురుషాధిక్యతకు సూచికలు కదా...?

కథనం : గంగోత్రి, 9 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర

చిత్రాలు: సుహాసిని, రాధా స్కూల్ ఆఫ్ లెర్నింగ్, అనంతపురం.

అనగనగా ఒక రాజు ఉండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. మొదటి భార్యకు ఒక వెంట్రుక, రెండవ భార్యకు రెండు వెంట్రుకలు ఉండేవి.

రాజుకి చాలామంది సలహాదారులు ఉండేవాళ్ళు. వాళ్లలో ఒకడు రెండో భార్యకు దగ్గర. ఒకసారి ఆమె వాడితోటి రాజుకు చెప్పించింది: "ఒక వెంట్రుక ఉండే భార్య కన్నా రెండు వెంట్రుకలు ఉన్న భార్య మేలు" అని. వాడి మాటలు పట్టుకున్న రాజు మొదటి భార్యని బయటికి గెంటేశాడు.

మొదటి భార్య అప్పుడు బాధపడుకుంటూ పోతూంటే దారిలో కొన్ని నల్ల చీమలు కనిపించాయి. అవి ఆమెతో అన్నాయి

"అమ్మా! అమ్మా! మమ్మల్ని తొక్కద్దు తల్లీ! ఎప్పుడైనా నీకు నోటి నిండా చక్కెర పోస్తాము" అని.

"సరేలే, మిమ్మల్ని తొక్కితే నాకేమొస్తుంది?" అని ఆమె వాటిని తొక్కకుండా ముందుకు పోయింది.




ఇంకా ముందుకు వెళ్ళాక ఆమెకు ఒక గాడిద కనిపించింది. గాడిద ఆమెతో "అమ్మా! అమ్మా! నాకు కొంచెం గడ్డి వేయమ్మా, ఎప్పుడైనా నిన్ను ఎక్కించుకొని తీసుకు వెళ్తాను!" అంది. "సరేలే పాపం ఆకలి వేస్తుండచ్చు" అని ఆమె గాడిదకు గడ్డి వేసింది.

ఇంకా ముందుకు వెళ్తుంటే అక్కడ ఒక పాడుబడ్డ గుడి కనిపించింది. అందులో దేవుడు ఆమెతో మాట్లాడాడు: "అమ్మా! నాకు పూజ చెయ్యమ్మా! ఎప్పుడైనా నీకు ఒంటినిండా నగలు ఇస్తాను" అని.

"నీ నగలు నాకెందుకులేగానీ, నీకు పూజ చేస్తాను ఆగు!" అని ఆమె ఆ గుడి అంతా ఊడ్చి శుభ్రం చేసి, అక్కడి అక్కడి పూలు తెచ్చి దేవుడికి పూజ చేసింది.

ఇంకా అట్లా పోతా ఉంటే ఆమెకు ఒక అవ్వ కనబడింది. "నాకేదైనా ఒక రొట్టి కాల్చి పెట్టు తల్లీ! నాకు తెలిసిన సాయం నేను చేస్తాను" అంది అవ్వ.

"దానిదేమున్నది, నీ సాయం నాకేమీ అక్కర్లేదుగానీ, రొట్టె కాల్చి ఇస్తాను ఆగు!" అని అవ్వకు రొట్టె కాల్చి ఇచ్చింది రాణి.

రొట్టె తిన్నాక అవ్వ రాణిని చూసి "నీకు వెంట్రుకలు కావాలంటే ఏం చేయాలో తెలుసుగా?" అంది.

"అయ్యో! అది తెలిస్తే ఇక్కడిదాకా ఎందుకొస్తుంది కథ?" అని రాణి ఆమెకు

తన కథ అంతా చెప్పుకుని, "ఇంతకీ అవ్వా! నాకు వెంట్రుకలు రావాలంటే ఏం చేయాలో చెప్పు, నీకు పుణ్యం ఉంటుంది" అని అడిగింది.

అప్పుడు ఆ అవ్వ ఆమెకు ఒక నది చూపించి, "అందులో మునుగు. నీకు ఏది రాసి ఉంటే అట్టాగ అవుతుంది" అని చెప్పింది.




సరే అని రాణి ఆ నదిలో మునగగానే ఆమెకి తల నిండా నల్లని వెంట్రుకలు వచ్చేసాయి!

రాణి అవ్వకు దణ్ణం పెట్టుకొని వెనక్కి తిరిగింది. "దారిలో దేవుడిని కలిసి పో తల్లీ!" అని చెప్పింది అవ్వ.

సరేనని వెనక్కి పోయి దేవుడికి మొక్కుకున్నది రాణి. దేవుడు తన మాట ప్రకారం ఆమెకు ఎక్కడలేని నగలూ ఇచ్చాడు.

ఆమె ఆ నగలు పెట్టుకొని నడుస్తూ పోతావుంటే గాడిద ఎదురై, "మీదికి ఎక్కు! నిన్ను బాగా తీసుకు పోతా" అంది.

అట్లా దేవుడిచ్చిన నగలు పెట్టుకొని, గాడిదనెక్కి పోతున్న రాణిని చూడగానే చీమలు ఆమె నోటినిండా చక్కెర పోసి పంపించినై.

అట్లా వచ్చిన రాణిని చూసి రాజు ఇంక నోట మాట రాకుండా అయిపోయినాడు. వెంటనే రెండో భార్యని గెంటేసి, మొదటి భార్యని పిలుచుకున్నాడు.

పోతూ పోతూ రెండో భార్య మొదటి భార్యను అడిగింది- "అక్కా! నీకు ఇన్ని వెంట్రుకలు ఎట్లా వచ్చినాయి?" అని.

మొదటి రాణి చెప్పింది "చీమల్ని

తొక్కకుండా, గాడిదకు గడ్డి వేసి, దేవుడికి పూజచేసి వెళ్ళి, అవ్వకు రొట్టె కాల్చి ఇచ్చి, నదిలో మునగాలి" అని.




"సరేలే, దానిదేముంది, నేనూ నదిలో మునిగి నిండా వెంట్రుకలు పెట్టుకొని వస్తాను" అని అదే దారిలో పరుగెత్తింది రెండో రాణి.

అట్లా ఆమె పరుగు పెడుతుంటే చీమలు ఆమెను వేడుకొన్నాయి "తల్లీ తల్లీ! మమ్మల్ని తొక్కకు! నీకు నోటినిండా చక్కెర పోస్తాము" అని.

అయినా నదిలో మునగాలని తొందరలో ఉన్న ఆమె, వాటిని అలాగే తొక్కుకుంటూ పరుగు పెట్టింది.

ఇంకాస్త ముందుకు వెళ్లాక గాడిద అడిగింది "తల్లీ! నాకు కొంచెం గడ్డి వేయి. నిన్ను ఎప్పుడైనా ఎక్కించుకు వెళ్తాను" అని.

కానీ "నువ్వు నన్ను ఎక్కించుకునేదేంది, నేనే పరుగు పెడతా వేగంగా" అని గడ్డి వేయకుండానే వెళ్ళిపోయింది ఆమె.

అట్లాగే దేవుడు కూడా ఆమెని అడిగాడు "పూజ చేసి పో తల్లీ! ఎప్పుడైనా నీకు నగలు ఇస్తాను" అని.




"నీ నగలు నాకెందుకు? నాకే కొల్లలుగా

ఉన్నాయి" అని పూజ చెయ్యకుండానే వెళ్ళిపోయింది ఆమె.

అక్కడ అవ్వకు రొట్టె కూడా చేసి పెట్టలేదు. "నీ రొట్టె నువ్వు కాల్చుకో! ఇంతకీ నదికి దారి ఏది?" అని అడిగింది.

అవ్వ నది వైపు చూపించగానే, అక్కడికి పరుగు పెట్టి బుడుంగుమని మునిగింది చిన్న రాణి.

లేచి చూస్తే ఏముంది, ఆమెకు ఉన్న రెండు వెంట్రుకలూ ఊడిపోయినై!

అవ్వని అడుగుదామని చూస్తే అక్కడ అవ్వా లేదు, అవతలగా దేవుడూ లేడు, గాడిదా, చీమలూ ఏవీ లేవు!!

నిండా గుండు అయిన చిన్నరాణి మళ్ళీ రాజు దగ్గరికి, పెద్ద రాణి దగ్గరికి వెళ్ళి, తన తప్పు ఒప్పుకున్నది.

రాజు, రాణి ఆమెను క్షమించి ఇంట్లో పెట్టుకున్నారు. క్రమంగా చిన్నరాణికి కూడా వెంట్రుకలు వచ్చేసాయి! ●

**విజ్ఞప్తి:**

2018 జనవరి సంచిక నుండి కొత్తపల్లి విడి ప్రతి ధర రూ. 30 అవ్వనున్నది.

తదనుగుణంగా పన్నెండు సంచికలకోసం ముందస్తు చందా రూ.360 గా నిర్ణయించటమైంది.

ఇప్పటికే చందాదారులైన వారి చందాలను, మారిన యీ ధరలకు అనుగుణంగా సవరించనున్నాము.

పాఠకులు, పంపిణీ దారులు, శ్రేయోభిలాషులు అర్థం చేసుకొని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

మీ చందాలను ఆన్‌లైనులో నేరుగా http://instamojo.com/kottapalli నుండి కట్టవచ్చు.

లేదా, మా చిరునామాకు మనీ ఆర్డరు ద్వారా పంపవచ్చు:

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురంజిల్లా- 515101




# కోకిల కంఠం

రచన : వెంకట్, 9 వ తరగతి, కల్లం అంజిరెడ్డి విద్యాలయ, మదీనాగూడ, హైదరాబాదు.
సౌజన్యం: కథా పాఠశాల, రవి శంకర్ వుండి.

దేవుడు అన్ని పక్షులకూ రంగులు వేస్తున్నాడు. ముందుగా నెమలి వెళ్ళి, దేవుడి దగ్గరున్న అన్ని రంగులూ తనకు వేయించుకున్నది.

అదే, వచ్చి మిగతా పక్షులకు కూడా చెప్పింది. దాంతో అన్ని పక్షులూ దేవుడి ముందు క్యూ కట్టి నిల్చున్నాయి. ఆయన దగ్గరున్న రంగుల్లోంచి ఎంచుకొని, తమకు ఇష్టం వచ్చిన రంగులు వేయించుకున్నాయి.

అయితే ఈ జాతర జరిగే సమయానికి కోకిల వేరే ఊరికి వెళ్ళి ఉన్నది. దానికి ఈ సంగతి తెలీలేదు. తీరా సాయంత్రం వచ్చేసరికి దేవుడి దగ్గర అన్ని రంగులూ అయిపోయాయి.

"ఇంకే రంగులూ మిగల్లేదు కోకిలమ్మా! నలుపు రంగు ఒక్కటే ఉంది. అది వేసుకో" అన్నాడు దేవుడు.

"ఏ రంగయితే ఏమున్నదిలెండి స్వామీ! నలుపే చాలు!" అంటూ నలుపు రంగు వేసుకున్నది కోకిల.




అప్పుడు గుర్తుకొచ్చింది దేవుడికి- "కోకిలని నలుపు రంగు వేసుకొమ్మన్నాను కానీ, దీనికి కాకికి తేడా ఏముంటుంది?! ఇద్దరిదీ నలుపు రంగే అయ్యిందే!" అని బాధపడ్డాడు.

అయినా కోకిల మటుకు ఏమీ చిన్న పోలేదు. అప్పుడు దేవుడు "అందరికీ వాళ్ళు కోరిన రంగులు వేశాను. కానీ పాపం నీకు అట్లా కుదరలేదు. అందుకని ఒక పని చేస్తాను. నీ రంగు సంగతి ఎట్లా ఉన్నా, నీకు మటుకు మంచి గొంతును ఇస్తాను.

తీయని నీ గొంతును వినగానే అందరూ నిన్ను 'కోయిల' అని గుర్తు పట్టేస్తారు. నీ పాట వినగానే అందరికీ 'వసంతం వచ్చేసింది' అని అర్థమౌతుంది" అన్నాడు.




ఆ రోజు నుంచి కోకిలకు మధుర స్వరం వచ్చేసింది. వసంతకాలం వచ్చేసిందని మనందరికీ ఆ కోకిలే చెబుతున్నది, ప్రతిసారీ!

మీకు తెలుసా? 'కుహూ' మనే కోకిల అరుపు స్థాయి సప్త స్వరాల్లోని 'ప' తో సరిపోలుతుందట!




# రైతు-కుక్క

రచన : రుత్విక్, 7 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి.

అనగనగా ఒక ఊళ్లో అమాయకపు రైతు ఒకడు ఉండేవాడు. అతనికి నాలుగు ఆవులు ఉండేవి. రోజూ అవి ఇచ్చే పాలని అమ్ముకునేందుకు గాను రైతు పట్టణానికి వెళ్ళి వచ్చేవాడు.

ఒకసారి అతను అట్లా వెళ్తుంటే కుక్క ఒకటి వచ్చి అతని ఎదురుగా నిల్చున్నది. పాల క్యాన్ వంకే చూస్తూ "భౌ.. భౌ.." మని మొరగటం మొదలెట్టింది. కొంచెం సేపటికి దాన్ని చూసిన రైతు "పాలు కావాలా? ఎన్ని కావాలి?" అన్నాడు దానితో.

ఆ కుక్క మళ్ళీ "భౌ..భౌ.." అన్నది.

"ఓహో! ఒక లీటరు కావాలా?!" అన్నాడు రైతు.

కుక్క మళ్లీ "భౌ..భౌ" అని, ముందుకొచ్చి క్యాన్‌ని నాకింది.

"ఉండవే! నువ్వూ, నీ తొందరా!" అన్నాడు

రైతు మురిపెంగా, ఒక ఆకుని తీసుకుని, దోనెలాగా చేసి, అందులో పాలు పోసి, కుక్క ముందర పెడుతూ. కుక్క గబగబా పాలన్నీ త్రాగేసి వెళ్ళిపోబోయింది నిశ్శబ్దంగా-



"ఏయ్! డబ్బులు ఇవ్వకుండానే పోతున్నావే?!" అని అరిచాడు రైతు.

కుక్క ఆగి, అతనికేసే చూస్తూ నాలిక బయట పెట్టింది.

"చూసింది చాలు. పాల డబ్బులు కట్టి, కదులు!" అన్నాడు రైతు.

కుక్క మళ్ళీ "భౌ..భౌ.." అన్నది.

"ఓయ్! నీ దగ్గర డబ్బులు లేవా?! ఐతే పర్లేదులే, రేపు తెచ్చి ఇవ్వు!" అంటూ రైతు తన దారిన తాను పోయాడు.

మర్నాడు కూడా అదే సమయానికి కుక్క రైతుకు ఎదురు వచ్చి, "భౌ..భౌ" అని అరిచింది.

"వచ్చావా! నిన్నటి పాల డబ్బులు- ఇస్తావా?" అన్నాడు రైతు.

కుక్క అతని చుట్టూ తిరుగుతూ "భౌ..భౌ.." అంది మళ్ళీ.

"ఓహో! ముందు ఒక లీటరు పాలు ఇవ్వమంటావా?! సరే, కానివ్వు!" అని క్రితంరోజు లాగానే ఇంకో లీటరు పాలు తాగించాడు రైతు.

పాలు త్రాగాక తన వైపే చూస్తూ కూర్చున్న కుక్కను చూసి విసుక్కుంటూ "ఇంకా ఏం చూస్తావు? చూసింది చాల్లే, డబ్బులు ఇచ్చెయ్యి ఇంక!" అన్నాడు.

కుక్క మౌనంగాపడుకుంది.

"ఏంటి, డబ్బులు ఇవ్వకుండా పడుకున్నావు?! లే, లేచి డబ్బులు ఇవ్వు!" అన్నాడు రైతు దాని దగ్గరికి వెళ్ళి.

కుక్క బద్ధకంగా కళ్ళు తెరిచి చూసి, మళ్ళీ

పడుకుంది.

"ఏంది వేషాలేస్తున్నావా? డబ్బులు ఇవ్వకుండా పడుకున్నావు?! లే, ముందు!" అన్నాడు రైతు కోపంగా.




కానీ కుక్క కదలలేదు. కనీసం కళ్ళు కూడా తెరిచి చూడలేదు.

దాంతో కోపం పట్టలేని రైతు చేతికందిన కర్ర ఒకటి తీసుకుని దాన్ని కొట్టేందుకు ముందుకు దూకాడు.

అది గ్రహించిన కుక్క చటుక్కున లేచి పరుగు పెట్టింది. రైతు దానివెంట పడ్డాడు.

అతనికి దొరకకుండా తప్పించుకునే ప్రయత్నంలో కుక్క పరుగెత్తుకుంటూ కొండ క్రింద ఉన్న పొదల్లోకి వెళ్ళింది.

అయితే సరిగ్గా ఆ సమయానికి ఆ పొదల్లోనే ఒక దొంగ కూర్చొని ఉన్నాడు. అంతకు ముందు రోజు రాత్రి దొంగతనం చేసి తను తెచ్చుకున్న డబ్బుని అక్కడ కూర్చొని లెక్క పెట్టుకుంటున్నాడు వాడు. దొంగని చూడగానే కుక్క ఆగిపోయి "భౌ..భౌ" మంటూ అరిచింది.

దాని వెనకనే పరుగెత్తుకొస్తున్న రైతు "ఏయ్! ఆగు! నా డబ్బులు ఇచ్చెయ్యి మర్యాదగా!" అని అరుస్తున్నాడు. మరుక్షణం ఆ దొంగవాడు డబ్బునంతా అక్కడే వదిలేసి ఉన్నపళంగా పరిగెత్తి పోయాడు.

కుక్క ఆ డబ్బుల చుట్టూనే తిరిగి వాసన చూడటం మొదలు పెట్టింది.

అంతలో అక్కడికి చేరుకున్న రైతుకు చాలా సంతోషం వేసింది. కుక్క అంటే మళ్ళీ ఓసారి ప్రేమ పుట్టుకొచ్చింది. "ఓహో! ఇదా, నువ్వు ఇందాకటినుండీ చెబుతున్నది! 'నా దగ్గర చాలా డబ్బులు ఉన్నాయి, ఇక్కడ దాచిపెట్టాను' అని చెబుతున్నావా? నాకు

అస్సలు అర్థమే కాలేదు.



'డబ్బులు ఇవ్వను' అంటున్నావేమో, అని నిన్ను అపార్థం చేసుకున్నాను" అంటూ వంగి ఆ డబ్బునంతా తీసుకొని మూటలో పెట్టుకున్నాడు "రెండు లీటర్ల పాలకే చాలా డబ్బు ఇచ్చావే, ఎలాగ మరి?" అంటూ.

కుక్క తోక ఊపుతూ "భౌ..భౌ" అన్నది.

"సరేలే! నీ బాకీ ఉంచుకోనులే. నీ బాకీ తీరేదాకా రోజూ నీకు పాలు పోస్తానులే, సరేనా?!" అని తృప్తిగా నవ్వుకుంటూ ఇంటి దారి పట్టాడు రైతు.

అయితే ఆ తరువాత మళ్ళీ రైతుకు ఆ కుక్క కనబడనే లేదు.

"పాపం పిచ్చిది! తన దగ్గర డబ్బులు లేవని, మళ్ళీ డబ్బులు సంపాదించుకునేందుకు వెళ్ళి ఉంటుంది! దాని డబ్బులు నా దగ్గర ఉన్నాయని అర్థం కాలేదేమో, దానికి!" అని ఇప్పటికీ అనుకుంటూనే ఉన్నాడు రైతు.

తెలుసా?

1. మన దేశంలో రైల్వే ప్యాసింజర్ కోచ్ లను తయారుచేసే ఫ్యాక్టరీ ఎక్కడ ఉన్నది? పెరంబూర్
2. మన దేశంలోని మొదటి సిమెంటు ఫ్యాక్టరీని ఎక్కడ నెలకొల్పారు? మద్రాసులో
3. మనదేశంలోని ఏ రాష్ట్రంలో అత్యధిక అటవీ ప్రాంతం ఉంది? మధ్యప్రదేశ్‌లో
4. రంగస్వామి కప్ ఏ క్రీడకు సంబంధించినది? హాకీ
5. 2016 ఒలింపిక్స్ ఏ దేశంలో జరిగాయి? బ్రెజిల్‌లోని రియో
6. బుద్ధుని జన్మస్థలం ఏది? నేపాల్ లోని లుంబినీ వనం




# ఈకలకు వచ్చిన కళ్ళు

రచన: హిమవర్షిణి, 8 వ తరగతి, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
బొమ్మలు : భార్గవి, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.

అనగనగా ఒక పక్షి రాజ్యం ఉండేది. ఆ రాజ్యానికి రాజు నెమలి. అప్పట్లో నెమలి ఈకల మీద ఇంత చక్కని కళ్ళు ఉండేవి కావు. అయినా కూడా అది చూసేందుకు బాగానే ఉండేది.

రాజ్యంలోని పక్షులన్నీ రోజంతా బాగా కష్టపడి తమ తమ చేన్లలో పంటలు పండించేవి. అందరూ ఆనందంగా నివసించేందుకు అవసరమైనన్ని గింజల్ని సంపాదించేవి.

ఒకసారి సూర్య భగవానుడికి ఒక అనుమానం వచ్చింది: 'భూలోకంలో ఇన్ని రాజ్యాలు ఉన్నాయి కదా, ఎక్కడైనా మంచితనం అనేది ఉన్నదా?' అని.

అందుకని ఆయన మారువేషం వేసుకొని, ఈ ప్రపంచంలోని అన్ని రాజ్యాలూ తిరిగి, అక్కడి ప్రజల్ని, రాజుల్ని పరీక్షిద్దామని

బయలుదేరాడు.




కానీ ఏ రాజ్యంలో చూసినా అక్కడి ప్రజలలో గాని, రాజుల్లో గానీ ఎక్కడా మంచితనం కనబడలేదు సూర్యభగవానుడికి. అట్లా తిరుగుతూ తిరుగుతూ నిరాశపడి, చివరికి మన పక్షి రాజ్యం చేరుకున్నాడు ఆయన.

రాజ్యంలోకి అడుగు పెట్టిన వెంటనే అనిపించింది: "ఇక్కడ ఎవరికో ఒక్కరికి మంచితనం ఉంది ఖచ్చితంగా!" అని. కానీ ఆ మంచివాళ్ళెవరో కనుక్కునేదెట్లా? అందుకని ఆయన మళ్ళీ వేషం మార్చాడు. ఈసారి ఆరోగ్యం బాగా లేని పక్షిగా మారాడు. ఇంద్రుడికి చెప్పి, ఒక పెద్ద గాలి వానను కూడా తెప్పించాడు. ఆ పైన ఆయన "తుఫాను వస్తోంది- తల దాచుకునేందుకు కొంచెం తావు ఇవ్వండి తల్లీ!" అంటూ గూడు-గూడు తిరిగాడు.

కొత్త పక్షిని చూడగానే రాజ్యంలోని పక్షులన్నీ తలుపులు వేసేసుకున్నాయి. "మా ఇల్లు చిన్నది" అని ఒకటి అంటే, "పిల్లలు నిద్రపోతున్నారు" అని ఒకటి అన్నది- తప్పిస్తే, "లోపలికి రా, పర్లేదు" అని ఏ పక్షీ అనలేదు.

"అన్ని గూళ్ళూ తిరిగేసాను- ఇప్పుడు ఇక మిగిలింది నెమలి ఒక్కటే"అని, సూర్యభగవానుడు నెమలి దగ్గరికి వచ్చాడు.

రాజభవనం దగ్గరికి చేరుకున్నాడో లేదో, నెమలి తనంతట తానే ఆయన్ని లోపలికి పిల్చి, తల తుడుచుకునేందుకు తువ్వాలు ఇచ్చింది. "ఇంత గాలివానలో బయటికి ఎందుకు వచ్చావు?" అని అడిగి, "ఈ పక్షికి భోజనం ఏర్పాట్లు, పడక ఏర్పాట్లు చేయండి; డాక్టరుగారిని ఒకసారి వచ్చి చూడమనండి" అని ఆదేశించింది పనివాళ్లను.

అప్పుడు సూర్యభగవానుడు తన సొంత రూపం ధరించి "ఓ నెమలీ! ఇప్పటి వరకూ నేను ప్రపంచంలోని అన్ని రాజ్యాలూ తిరిగాను. ప్రతిచోటా సమస్యల్లో ఉన్న పౌరుల వేషం వేసాను. రాజ్యంలో ఎవరైనా అట్లాంటివాళ్లని 'గమనిస్తారా, పట్టించు-కుంటారా, కొంచెమైనా కాపాడతారా' అని పరీక్షించి చూసాను. ఎవ్వరూ పట్టించుకో-లేదు. ప్రతివాళ్ళూ "మేం చాలా కష్టాల్లో ఉన్నాం; మా సమస్యలే తీర్చేవాళ్ళు లేరు" అనుకుంటూ తమలో తాము మునిగి ఉన్నారు కానీ, ఇతరుల బాధల పట్ల కరుణను వ్యక్తం చేసిన వాళ్ళు లేరు.

నాకు నిన్ను చూస్తే చాలా గర్వంగా అనిపించింది. రాజుగా నువ్వు నీ బాధ్యతని విస్మరించటం లేదు. నీకేదైనా వరం ఇవ్వాలని ఉంది. ఏం కావాలో కోరుకో!" అన్నాడు.

నెమలి ఆయనకు నమస్కరిస్తూ "స్వామీ! నాకు వేరే ఏ కోరికా లేదు- నా రాజ్యంలో ఎవరికీ కష్టం కలగకుండా చూసుకోవటం తప్ప. అయితే నాకున్న ఈ రెండు కళ్ళూ సరిపోవట్లేదు ఇంత పెద్ద రాజ్యాన్ని పరిపాలించటానికి. అదొక్కటే నాకు కనిపించే వెలితి" అన్నది.




సూర్యభగవాడు "ఓ! సరే! ఇదిగో తక్షణం నీ ఈకల మీద కళ్ళు ప్రసాదిస్తున్నాను. నీ రెండు కళ్ళతో నువ్వు ప్రపంచాన్ని చూస్తావు; అదే సమయంలో నీ ఈ వెయ్యీ కళ్ళనీ ప్రపంచం చూస్తుంది. నీ ఈకలకున్న ఈ కళ్ళు పక్షులకు ఆదర్శంగా నిలుస్తాయి" అని మాయమైపోయాడు. అట్లా వచ్చాయి, నెమలి ఈకలకు ఇంత చక్కని కళ్ళు!



# రాజుగారి కోతి

*పంచతంత్రంలో భాగంగా చెప్పుకునే ఈ కథని మళ్ళీ ఓసారి గుర్తు చేసాడు జయప్రకాష్- "అందుకే మూర్ఖులతో చనువు మంచిది కాదు" అంటూ.*

*రచన : యస్.జయప్రకాష్, 3 వ తరగతి, క్రాస్ వర్డ్ స్కూల్, గుంటూరు*

అనగనగా ఒక రాజుగారు ఉండేవారు. ఆయనకి ఒక పెంపుడు కోతి ఉండేది. ఆ కోతి చాలా మూర్ఖంగా ఉండేది.

కానీ రాజు గారికి మాత్రం కోతి అంటే చాలా ఇష్టం. కోతికి కూడా రాజుగారంటే చాలా ప్రేమ.

ఆ కోతిని ఎవ్వరూ ఎప్పుడూ కట్టేసేవాళ్ళు కాదు. రాజుగారి గదిలోకి కూడా ఎప్పుడంటే అప్పుడు వెళ్ళి వచ్చే స్వేచ్ఛ ఉండేది దానికి.

ఒకరోజు రాజుగారు నిద్రపోతున్నారు. ప్రక్కనే కూర్చొని, ఆయన్నే చూస్తూన్నది కోతి.

అంతలో రాజుగారి భుజం మీద ఈగ

వాలింది. కోతి ఈగను తోలింది. కానీ ఈగ పోలేదు. మళ్ళీ మళ్ళీ రాజుగారి మీద వాలుతూనే ఉంది.

చెయ్యి మీద వాలింది. మళ్ళీ వచ్చి నుదుటి మీద వాలింది. కోతి తోలగానే ఎగిరి పాదం మీద వాలింది. కొంచెం ఎగిరి వచ్చి ఈసారి

వెంటనే వెళ్ళి గోడకు వ్రేలాడుతున్న పెద్ద కత్తిని ఒకదాన్ని తీసుకుని వచ్చి రాజుగారి దగ్గర కూర్చున్నది.

ఈసారి ఈగ రాజుగారి మీద వాలిన మరుక్షణమే ఆ ఈగ మీద దాడి చేసింది.

ఈగ తప్పించుకున్నది; కానీ రాజుగారికి



దోచుకోలేదు. ఆ డబ్బుల్ని నేనే తీసుకొమ్మన్నాను అతన్ని" అని. ఆ వెంటనే ఉత్సాహంతో మెరిసే కళ్ళతో చెప్పాడాయన- "డబ్బులు తీసుకొని వెళ్తూ ఇతను నాకు థాంక్స్ కూడా చెప్పాడు!" అని.



షిచిరిని, ఆయన మాటల్ని గుర్తు చేసుకోని రోజే లేకుండింది అతనికి!

సంవత్సరాలు గడిచాక, షిచిరి ఇంకా ముసలివాడైన తరుణంలో- ఎవరో ఆయన ఇంటి తలుపు తట్టారు. తలుపు తెరిచి చూస్తే ఎదురుగా నిలబడి ఉన్నాడు, ఆ దొంగ! అప్పుడే జైలులో నుంచి బయటకు వచ్చినట్లున్నాడు- భుజానికి వ్రేలాడుతూ ఒక చిన్న బట్టల మూట. పెరిగిన వయస్సు; కళ్ళనిండా నీళ్ళు.

"ఆహా! వచ్చావా! నువ్వు ఇంకా రాలేదే



# నిజం చెబుదాం!

రచన : చాతుర్య, 7 వ తరగతి, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.



కార్తీక్ ఒక అల్లరి పిల్లవాడు. వాడు, వాళ్ల అమ్మ ఇద్దరూ ఒక టౌన్‌షిప్ చివర్లో ఉండేవాళ్ళు. వాళ్ల టౌన్‌షిప్‌లో వాళ్ళంతా చదువుకునేందుకు ఒక స్కూల్ ఉంది. కార్తీక్ ఆ స్కూల్‌లోనే చదువుతాడు.

కార్తీక్ బాగానే చదువుతాడుగానీ, వాడికి చెడ్డ అలవాటు ఒకటి ఉండేది: స్నేహితుల వస్తువుల్ని వాడు దొంగలించేవాడు. వాళ్ళ పెన్నులు, పెన్సిళ్ళు, ఇరేజర్లు ఏవి దొరికితే

అవి- మాయం చేసేసేవాడు.

ఈ సంగతి తెలిసాక వాళ్ల అమ్మ వాడికి చాలా సార్లు చెప్పింది "ఒరే! వేరేవాళ్ల వస్తువులు తీసుకోకూడదు; మళ్ళీ వాళ్ళు ఏడుస్తారు కదా! మనకు ఏమైనా వస్తువులు కావాలంటే మనమే సొంతగా కొనుక్కోవాలి" అని. అయినా వాడు వినేవాడు కాదు.

అట్లా చాలా మంది పిల్లల వస్తువులు పోయినై. చివరికి వాళ్ల తరగతి ఉపాధ్యాయుడు నిశ్చయించుకున్నాడు- "ఈ పని ఎవరు చేస్తున్నారో తప్పక కనుక్కుంటాను" అని.

ఆ రోజున ఆయన తరగతిలోనికి రాగానే పిల్లలు కొందరు లేచి కంప్లెయిన్ చేసారు. "మా వస్తువులన్నీ పోతున్నై సర్, ఎవరో తీసుకెళ్ళిపోతున్నారు!" అని.

ఆయన కొంతసేపు "ఆస్తిహక్కు" గురించి మాట్లాడి, "సరేలెండి! నాకు ఇట్లాంటి పనులన్నీ ఎవరు చేస్తున్నారో ముందుగానే తెలుసు. అయితే అందరి ముందూ వాళ్ళెవరో చెప్పేస్తే మరి వాళ్ళు చాలా బాధ పడతారు- అందుకని, ప్రస్తుతానికి వాళ్ళ పేరు బయట పెట్టటం లేదు. ఒక పని చేస్తాను- సాయంత్రం వరకూ సమయం ఇస్తాను. ఆలోగా వాళ్ళు సొంతంగా ముందుకొచ్చి, నా ముందు నిజం ఒప్పుకుంటే, ఇక వాళ్ళను ఏమీ అనను. అట్లా ఎవ్వరూ ముందుకు రాకపోతే అప్పుడింక చెయ్యగలిగేది ఏముంది, వాళ్ల పేరు ఏంటో నేనే చెప్పేస్తాను అందరిముందూ!" అన్నాడు.




దాంతో కార్తీక్‌కి భయం వేసింది.

అందరిముందూ తన పేరు చెబితే పిల్లలంతా తనని ఎగతాళి చేస్తారు, పేరు పెడతారు. దానికంటే వెళ్ళి ఉపాధ్యాయుడి ముందు

నిజం ఒప్పుకోవటం మంచిది" అనుకున్నాడు.




ఆరోజు తను ఇంటికి వెళ్ళే ముందు కార్తీక్ ఉపాధ్యయుడి దగ్గరకు వెళ్ళి నిజం చెప్పాడు. క్షమించమని అడిగాడు. కార్తీక్ తనంతటన తానే నిజం చెప్పినందుకు ఉపాధ్యాయుడు చాలా సంతోషించాడు. "నువ్వు తీసుకున్న వస్తువులన్నీ రేపు తిరిగి ఇచ్చేయి. మళ్ళీ ఎప్పుడూ ఇతరుల వస్తువులను దొంగిలించకు- సరేనా?!" అని చెప్పాడు.

"సరే" అని, ఆయన చెప్పినట్లే చేసాడు కార్తీక్.

ఆ తర్వాత అతను ఇక మళ్ళీ ఎప్పుడూ ఇతరుల వస్తువులను దొగలించలేదు.

అతనిలోని మార్పుని చూసి వాళ్ళ అమ్మ కూడా చాలా సంతోషించింది.

తెలుసా?

1. మనం వాడే కరెన్సీ నోట్ల పైన ఎవరి సంతకం ఉంటుంది? జ) రిజర్వు బ్యాంకు గవర్నర్
2. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతుందని కనుగొన్న పాశ్చాత్య శాస్త్రవేత్త? జ) కోపర్నికస్
3. పాలలోని క్రొవ్వు పదార్థం ఏ సమయంలో తగ్గుతుంది? జ) వేసవికాలంలో
4. ప్రపంచంలోకెల్లా లోతైన సరస్సు ఏది? జ) బైకాల్ సరస్సు
5. మన దేశంలో కరెన్సీ నోట్లను ఎవరు ముద్రిస్తారు? జ) రిజర్వు బ్యాంకు
6. తొలి కాకతీయులు పోషించిన మతం ఏది? జ) దిగంబర జైనం




# తెలివైన కోరిక

రచన: మౌనిక, 8 వ తరగతి, కల్లం అంజిరెడ్డి విద్యాలయ, మదీనాగూడ, హైదరాబాదు.




చాలా కాలం క్రితం ఒక రాజుగారు ఉండే-వారు. ఒకసారి ఆయన వేటకి వెళ్ళి, తిరిగి వస్తూ వస్తూ, మధ్యలో రథం దిగి ఒంటరిగా అడవిలోకి వెళ్ళారు.

ఆ సమయంలో అకస్మాత్తుగా పులి ఒకటి రాజుగారి మీదికి దూకింది.

రాజుగారి పరివారం ఎవ్వరూ దగ్గర్లో లేరు. అయితే అటుగా వెళ్తున్న స్నేహితులు ఇద్దరు తమ ప్రాణాలకు తెగించి పులిని ఎదుర్కొన్నారు. చేతులతోటే పోరాడి, పులిని

పారద్రోలారు. రాజుగారిని కాపాడారు.

రాజుగారు వాళ్ళిద్దరినీ చాలా మెచ్చుకొన్నారు. వాళ్ళను రాజధానికి ఆహ్వానించారు. వాళ్లకొక చక్కని విందు ఏర్పాటు చేశారు. విందు పూర్తయిన తర్వాత వాళ్ళిద్దరినీ చెరొక కోరికా కోరుకోమన్నారు.

మొదటివాడు అన్నాడు: "అయ్యా! నేను, నా కుటుంబం నివసించేందుకు ఇప్పుడు ఉంటున్న ఇల్లు సరిపోవట్లేదు. నాకు ఇంకా పెద్ద ఇల్లు ఒకటి కట్టించి పెట్టండి" అన్నాడు.

రాజుగారు సరేనన్నారు. దండనాధుడిని పిలిచి, అతని కోరికను నెరవేర్చమని ఆదేశించారు.

ఇక రెండవవాడు "మహా రాజా! సంతోషంగా జీవించేందుకు అవసరమైనవన్నీ ఉన్నాయి నాకు. అయితే నాది ఒక్కటే కోరిక- తమరు ఒకసారి మా ఇంటిని సందర్శించి, మాఇంటి భోజనం స్వీకరించాలి అనేది" అన్నాడు.

"సరే! తప్పక వస్తాం" అని అతనికి మాట ఇచ్చిన రాజుగారు "తగిన ఏర్పాట్లు చేయండి" అని మంత్రిని ఆదేశించారు.

రాజుగారి ఆదేశాల ప్రకారం దండనాధుడు మొదటి వాడికి చక్కని ఇంటినొకదాన్ని కట్టించాడు. అతని కోరిక నెరవేరింది.



అయితే మంత్రిగారికి మటుకు రెండవవాడి కోరిక తీర్చటంలో సమస్యలు ఎదురయ్యాయి. రెండవవాడి ఇల్లు చాలా చిన్నది; వాళ్ల గ్రామానికి వెళ్ళే రోడ్డు, వాడి ఇంటికి వెళ్ళే రోడ్లు కూడా అన్నీ పూర్తిగా గుంతలు పడి ఉన్నాయి. ఇక రాజుగారు తినగలిగే ఆహారం అక్కడ దొరికేట్లు లేదు; నీళ్ళు కూడా మురికిగా ఉన్నాయి.

దాంతో మంత్రిగారు ఆలోచించి, "అయ్యా!

నాకు ఒక ఐదు నెలల సమయం ఇప్పించండి" అని రాజుగారిని వేడుకొని, యువకులు ఉండే ఊరికి రోడ్డు వేయించాడు.



గ్రామంలోని రోడ్లన్నిటినీ సరిచేయించాడు, గ్రామం మొత్తానికీ రక్షిత మంచినీటి సౌకర్యం ఏర్పరచాడు, రెండవవాడికి పెద్ద ఇల్లు ఒకటి కట్టించాడు, కావలసిన కూరగాయలన్నీ పండించుకునేందుకుగాను పెద్ద తోటను ఒకదాన్ని కేటాయించాడు, మొత్తాన్నీ సర్వాంగ సుందరంగా తయారు చేయించాడు.

రెండవ వాడి కోరిక పుణ్యాన గ్రామంలోని ప్రజలందరికీ మేలు జరిగింది. "రాజుగారికి భోజనం పెట్టటం" వల్ల గ్రామానికి ఎంత లాభమో ఊళ్ళో వాళ్లంతా చాలా కాలం పాటు చెప్పుకున్నారు.

**పొడుపు కథలు**

1. గుడిచుట్టూ తిరిగి గుళ్ళో నీళ్ళు పోసింది, ఏంటది?
2. నాగస్వరానికి లొంగని నాగేంద్రుడు. నిప్పంటుకుంటే బుస్సుమంటాడు. ఎవడు వాడు?
3. సూర్యుడు చూడని గంగ, చాకలి ఉతకని మడుగు. ఏంటబ్బా, అది?
4. పొంచిన దెయ్యం, పోయినచోట ప్రత్యక్షం! ఏంటది చెప్పు?
5. నల్లకుక్కకు నాలుగు చెవులు! అదేంటో కనుక్కో?
6. ఒక్క కుక్కకు బండెడు పేగులు. ఏంటది?

జవాబులు: 1. టెంకాయ 2. చిచ్చు బుడ్డి 3. కొబ్బరి కాయ నీళ్లు 4. నీడ 5. లవంగం 6. మంచం

# షహీన్

పుస్తక సమీక్ష

*రచన : శ్రీ జి. రవి కిరణ్ ;  ప్రచురణ : మంచి పుస్తకం-తానా  ఫోన్:* 9490746614; *వెల :30 రూ.*




సిరియా దేశంలో అంతర్యుద్ధం జరుగుతోంది. సైన్యానికి, తిరుగుబాటు దారులకి మధ్య తీవ్రమైన యుద్ధం.. అమెరికా వాళ్లు తిరుగుబాటు దారుల పక్షం, రష్యా వాళ్లు సైన్యపు పక్షం..చమురు నిల్వల కోసం అధిపత్యపు పోరు..

అందరు ప్రజలలాగే పన్నెండేళ్ల షహీన్ కూడా వీళ్లందరి నడుమన చిక్కుకున్నది. తండ్రి అజార్ మాజీ సైనికుడు. తిరుగుబాటు దారులు అతన్ని సైనిక రహస్యాల కోసం, సైనికులు తిరుగుబాటు దారుల రహస్యాల కోసం వేధిస్తుంటారు.

ముందుచూపు గల అజార్ షహీన్‌కు ధైర్యంగా బతకాలని నేర్పించాడు. మార్షల్ ఆర్ట్స్‌లో శిక్షణ ఇచ్చాడు. తుపాకి పట్టుకోవడం నేర్పించాడు. ఆత్మరక్షణ ఎలా చేసుకోవాలో చెప్పాడు. అతను ఊహించినట్టుగానే, ఆ శిక్షణ మధ్యలోనే  సైన్యం అతన్ని ఎత్తుకెళ్లింది; చంపేసింది కూడా!

ఒకవైపున సైన్యం నుండి, మరో వైపున తిరుగుబాటు దారుల నుండి తప్పించుకుంటూ షహీన్ ఓ బాలికల శిబిరం చేరుతుంది. తోటి బాలికల్ని, గ్రామప్రజల్ని, యువకుల్ని కూడగడుతుంది. నాయకురాలు అవుతుంది. ప్రజలంతా స్వతంత్రంగా నిలబడి అణచివేతని ఎదుర్కొనేందుకు వ్యూహాలు రచిస్తుంది.  చివరికి సిరియా మొత్తాన్ని ప్రజల వశం చేస్తుంది.  "పిల్లలకు కావలసింది యుద్ధాలు కాదు-చదువులు"  అని నినదిస్తుంది.



తానా-మంచి పుస్తకం వారి బాల సాహిత్యపు పోటీ 2017 లో బహుమతి పొందిన ఈ అద్భుత సాహస నవల, 8-9-10 తరగతుల పిల్లల కోసం. బాగుంది.

**తప్పక చదవాల్సిన మంచి పుస్తకం!**



# మారిన గీత

"మన ముఖాన్ని మనం అద్దంలో చూసుకుని సరిచేసుకున్నట్లు, మన మనస్సుల్ని కూడా మనమే పరిశీలించుకొని సరిదిద్దుకోవాలి. ఎప్పుడూ నిజాన్నే పలకటం, అహింసాయుతంగా ప్రవర్తించటం అలవరచుకొని ఆదర్శ పౌరులం అవ్వాలి" అని చెబుతూ ఈ కథ వ్రాసి పంపారు అమ్మమ్మ గారు.

రచన : శ్రీమతి ఆదూరి హైమావతి, విశ్రాంత ప్రధానోపాధ్యాయిని, బెంగుళూరు.

సీత- గీత ఇద్దరూ పామర్రు పాఠశాలలో ఏడోతరగతి చదువుతున్నారు. ఇద్దరూ నిజంగా చాలా తెలివైనవాళ్ళే; ఇద్దరికి ఇద్దరే పోటీ.

ఐతే గీతకు మటుకు, సీత అంటే కాస్త అసూయ. కారణం సీత తనకంటే 'మంచి ఛాయ'లో, అందంగా ఉండటం; ఆమె వెంట్రుకలు ఇంత పొడవుగా, వంకీలు వంకీలుగా ఉండటం; ఆమె అందరితోటీ కలుపుగోలుగా మాట్లాడటం- "తనకు ఇవేవే లేవు; ఇవన్నీ సీతకు ఉన్న అదనపు అర్హతలు!" అని గీతకు కొంచెం కుళ్ళు.

గీత కాస్త ధనవంతుల బిడ్డ. అందుకే అందరితో అంత కలవదు. అయినా

అందరూ తనవెంటే ఉండాలని ఆశిస్తుంది. సీత అట్లా కాదు- తనది మధ్యతరగతి కుటుంబం. అందుకేనేమో, మరి అందరితోటీ చక్కగా కలుస్తుంది. ఎవరికి ఏ సాయం కావాలన్నా అడగకుండానే చేసేస్తుంటుంది. పిల్లలు అందరూ 'సీతా! సీతా!' అంటూ ఆమె వెంటే ఉంటారు.



ఒకసారి వాళ్ల క్లాస్ పిల్లాడు భాస్కర్ ఆటల్లో క్రింద పడ్డాడు. వాడి చేయి వాచి పోయింది- దాంతో వాడు పది రోజుల పాటు నోట్సు వ్రాసుకోలేకపోయాడు.

అయితే వాడు అడక్కుండానే వాడి నోట్సు వ్రాసిపెట్టింది సీత. మరోసారి వాళ్ల స్నేహితురాలు మాలతికి జ్వరం వచ్చింది- వారం పాటు తను స్కూలుకు రాలేకపోయింది పాపం. సీత ఆ పాపకు కూడా తానే నోట్సులన్నీ వ్రాసి ఇవ్వటమే కాక, వాళ్ల ఇంటికే వెళ్ళి, క్లాసులో జరిగిన పాఠాలన్నీ చెప్పింది. ఇట్లా ఎప్పుడూ ఎవరికో ఒకరికి, అడగకుండానే సాయం చేసేస్తుంటుంది తను. అందుకనే అంతా సీతను ఇష్టపడతారు; కానీ గీత మాత్రం 'అబ్బ! ఈ పేద బుద్ధుల సీతతో చస్తున్నాం!' అని విసుక్కునేది.

"బడిలో పిల్లలంతా అందరూ లైబ్రరీ పుస్తకాలు చదవాలి" అని వాళ్ల హెడ్మాస్టరు గారికి గట్టి కోరిక. పిల్లలకు పుస్తక పఠనం పట్ల ఆసక్తి పెంచాలని, ఆయన కొత్తగా ఒక ప్రతిపాదన చేసారు: ప్రతి క్లాసు పిల్లలకూ వాళ్ళ వాళ్ల స్థాయికి తగినట్లు కొన్ని పుస్తకాలు ఇస్తారు. వాళ్ళు వాటిని అన్నిటినీ చదివి, సొంత మాటలతో ఒక నోట్సు తయారు చేయాలి. ఏ వారానికి ఆ వారం, తమ

నోట్సును క్లాస్‌టీచర్ గారికి చూపించాలి. అట్లా పుస్తకాలు బాగా చదివి, నోట్సు తయారు చేసిన వాళ్లకు సంవత్సరాంతాన మంచి బహుమతులు ఇస్తారు!



ఆ క్రమంలో వీళ్లకి "గాంధీగారి ఆత్మ కథ- సత్యశోధన" పుస్తకం ఇచ్చారు.

తెలివైన గీత రోజూ ముప్పై పేజీల వరకూ చదివేసేది. ఆపైన "నువ్వు ఎన్ని పేజీలు చదివేసావు?" అని కనిపించిన వాళ్లనల్లా అడిగేది. "నువ్వెన్నో పేజీ?" అని వాళ్లెవరైనా అడిగితే తను మటుకు "నేను రోజుకు పది పేజీలు కూడా చదవలేకపోతున్నాను.. మీరే నయం" అని చెబుతుండేది.

కానీ రహస్యాలు ఎంత కాలం దాగుతాయి? సంగతి బయట పడనే పడింది. ఒకసారి గీత నూటయాభైయవ పేజీ చదువుతుండగా చూసిన పాప ఒకామె, సీతకు ఆ సంగతి చెప్పి- "ఎంత మోసపు పిల్లో చూడు. తనేమో ఎక్కువ చదివేసి, మనందరం తక్కువ చదవాలనే కదా, ఈ పాప ఇట్లా చేస్తున్నది?!" అన్నది. సీత తేలికగా నవ్వేస్తూ "ఎవరికి వాళ్లం, మనకు వీలైనంత మనం చదువుదాం. దీనిలో పోటీ అవసరం లేదు!" అనేసింది.

ఆరోజు పిల్లలు బడి నుండి ఇంటికి వెళ్ళే సమయానికి పెద్ద సుడిగాలి వీచింది. గీత కంట్లో దుమ్ము పడి, కళ్ళు ఎర్రగా అయి వాచాయి. మరునాడు తను బడికి రాలేకపోయింది.

సాయంత్రం బడి ఐపోగానే వాళ్ళింటికి వెళ్ళింది సీత- "బడికి ఎందుకు రాలేదు?" అని అడిగేందుకు.

ఆ సమయానికి గీత ఇంట్లో పడుకొని ఉంది. వాళ్ళమ్మ కంట్లో మందు వేస్తున్నది.




"బాగున్నావా, సీతా?" అని పలకరించి, "ఇదిగో, చూడు, మీ ఫ్రెండు సీత వచ్చింది, నీ కోసం" అన్నది గీత వాళ్లమ్మ. గీత కళ్ళు తెరవకుండానే "ఏం సీతా! నా కళ్ళు బాగా వాచినై అని, చూసి సంతోషించేందుకు వచ్చావా?!" అంది కోపంగా.

సీత నవ్వి "కాదు గీతా! నువ్వు ఇంకా గాంధీగారి ఆత్మకథ పూర్తి చేయలేదు కదా?! రేపే మనం నోట్సు సబ్మిట్ చేయాలి. అందుకని నీకు చదివి పెట్టి పోదామని వచ్చాను" అంది.

సీత మంచి బుద్ధి, అడక్కుండానే అందరికీ సాయం చేసే మనస్సు గీతకు తెల్సు కనుక లోలోపల సంతోషపడింది గీత.

ఆలోగా సీత తన దగ్గరున్న గాంధీగారి ఆత్మకథ పుస్తకం తీసి "ఎన్ని పేజీలు చదివావు గీతా?! ఆ పేజీ నుండే గట్టిగా చదువుతాను. నువ్వు జాగ్రత్తగా విని, చెబితే నీ నోట్సు కూడా నేనే వ్రాసి పెడతాను" అన్నది.

గీత ఆలోచనలో పడింది- "నిజానికి తను పుస్తకం చివరికి వచ్చింది.. కానీ ఆ సంగతి ఎవ్వరితోటీ చెప్పలేదు- 'ఏదో, ఊరికే నలభై-యాభై పేజీలు చదివా' అన్నట్లు చెప్పింది. మరి ఇప్పుడు ఈ సీతకి అసలు సంగతి తెలిసిపోతే ఎలాగ? కానీ ఇప్పుడు తను నిజం చెప్పలేదనుకో, మరి నోట్సు ఎవరు రాసిపెడతారు? ఇదేదో పెద్ద సమస్యే వచ్చి పడిందే!" అని.

చివరికి అయిష్టంగానే, తప్పదన్నట్లు, తను చదివిన పేజీ నెంబరు చెప్పేసింది. "ఇంతవరకూ వచ్చావా?" అని సీత ఆశ్చర్యపడుతుంది అనుకున్న గీతకు నిరాశే ఎదురైంది. సీత ఏమీ అనలేదు. తను చెప్పిన పేజీ తీసి చదవటం మొదలు పెట్టింది.

చదవటం అయ్యాక, నోట్ బుక్ తీసుకుని " చెప్పు గీతా, నోట్సు వ్రాసి పెడతాను"అంది.



గీత చెప్పినదంతా చక్కగా రాసి పెట్టింది సీత.

అంతా అయి చివరికి ముగిస్తుండగా సీత అడిగింది- "గీతా! గాంధీగారి ఆత్మకథనుండి మనం నేర్చుకోవాల్సిన ముఖ్యమైన విషయం ఏంటి?" అని.

గీత చెప్పింది కళ్ళుమూసుకునే- "ఏముంది సీతా! మనం ఆయనలా గొప్ప పేరు తెచ్చుకోవాలి" అని.

"కాదు గీతా! మనం కూడా ఆయన లాగా సత్యవాదులుగా అవ్వాలి: ఎన్నడూ ఎవ్వరికీ అసత్యం చెప్పకూడదు. ఎవ్వరికీ అపకారం తలపెట్టకూడదు: అహింసా మూర్తులమవ్వాలి. అందుకేనట, హెడ్మాస్టరు గారు మనకు ఈ ఆత్మకథ పుస్తకాన్ని ఇచ్చింది. "మన ప్రవర్తనను మనమే సరిదిద్దుకోవాలి; సమాజంలో మంచి పౌరులుగా ఎదగాలి" అని రాయమన్నారు. ఇదిగో నీ నోట్సు! నువ్వు చెప్పిన దాని చివర్లో నేను ఈ వాక్యాల్ని కూడా చేర్చేసానులే.



మరి రేపు వస్తావుగా, స్కూలుకు?! నువ్వే టీచర్ గారికి ఇచ్చేయచ్చు!" అంటూ తన చేతిలో నోట్స్ పెట్టింది సీత.

గీత చప్పున సీత చెయ్యి పట్టుకుని "సారీ

సీతా! నీ పట్ల అసూయతో ప్రవర్తించాను; అబద్ధాలు చెప్పాను; నిన్ను బాధ పెట్టాలనుకున్నాను. నన్ను క్షమించు" అన్నది.

"ఏమీ పర్లేదులే గీతా! 'మన తప్పును మనమే తెల్సుకుని, మనల్ని మనం సరిదిద్దుకోవటమే ఉత్తమ లక్షణం' అని హెడ్మాష్టరుగారు చెబుతుంటారు కదా! దాన్లో నువ్వు ముందున్నావ్! ఏం పర్వాలేదులే! వస్తాను మరి! ఆలస్యం అవుతున్నది" అంటూ కదిలింది సీత, ఇంటికెళ్ళేందుకు.

ఆ తర్వాత గీత చాలా మారింది. తోటివాళ్ల గురించి దయతో ఆలోచించసాగింది. అందరితోటీ బాగా కలిసిపోయింది.

టీచర్: ఏంట్రా రవీ! తలనొప్పి, దగ్గు, పడిశెం అని చెప్పి బడి ఎగ్గొట్టావు, కానీ సినిమాకు వెళ్ళావట?
రవి : అవునండీ, సినిమా యాడ్స్‌లో వీటికి ఏం మందు వేసుకోవాలో చూపిస్తారని, వెళ్ళానండి.

ఆసుపత్రిలో చావు బ్రతుకుల మధ్య ఉన్న ఒకాయన భార్యా పిల్లల్ని దగ్గరికి పిలిచాడు:
భార్యతో : ఇదిగో, నేను పోయాక, నువ్వు కూకట్‌పల్లిలో ఉన్న పది అపార్ట్ మెంట్స్ తీసుకో!
పెద్ద కొడుకుతో : నువ్వు దిల్‌సుఖ్‌నగర్‌లోని మూడు షాపింగ్ మాల్స్, ఒక గుడి తీసుకో!
రెండో కొడుకుతో : నువ్వు మెహదీ పట్నంలోని రెండు టెంపుల్స్ తీసుకో!
చిన్నోడితో : ఒరేయ్! నువ్వు లకడికపూల్‌లోని రెండు కాలనీలు తీసుకో!
కూతురితో : తల్లీ! నువ్వు శ్రీనగర్ కాలనీలోని రెండు స్వీట్‌షాప్స్ తీసుకో
పక్కనే నిలబడి వింటున్న నర్స్ అన్నది భార్యతోటి: మీ వారు చాలా గొప్పవారే! ఇన్నిన్ని ఆస్తులు సంపాదించడమే కాక, బాధ్యతగా పంచి పెడుతున్నారు కూడాను! అని.
"ఆస్తులా, పాడా?! మాది పాల వ్యాపారం తల్లీ! ఈయన ఇప్పుడు అప్ప చెబుతున్నది మా పాలఖాతాలు!" అన్నది ఆమె నిండా వాపోతూ!




# న్యాయం

రచన: శ్రీ కె.వి.కృష్ణారావు, కర్నూలు

చాలా కాలం క్రితం ధాన్యకటకంలో సూరయ్య, వరదయ్య అనే వ్యాపారులు ఇద్దరు ఉండేవాళ్ళు. ఇద్దరూ ఒకే రకం వ్యాపారాలు చేసేవాళ్ళు; ఇద్దరికీ సత్సంబంధాలు ఉండేవి.

ఒకసారి సూరయ్య, అతని భార్య కాశీకి పోయి రావాలనుకున్నారు. అయితే ఆ రోజులో డబ్బులు దాచుకునేందుకు బ్యాంకులు ఉండేవి కావు; అలాగని సొమ్మును వెంట తీసుకు పోదామంటే మార్గ మధ్యంలో దొంగల బెడద ఉండేది. దారి దోపిడి దొంగలు మాటు వేసి, బాటసారుల్ని దోచుకునే పరిస్థితులు ఎక్కువ. అందుకని ఆ రోజుల్లో ఎవరైనా యాత్రలకు పోవాలంటే ముందుగా తమ డబ్బును, నగల్నీ ఎవరైనా నమ్మకస్తుల దగ్గర దాచుకొని వెళ్ళేవాళ్ళు.

"మరి ఎలాగ?" అని ఆలోచించిన సూరయ్య తను అంతవరకూ కూడబెట్టిన డబ్బునూ,

భార్య నగల్నీ వరదయ్య దగ్గర దాచి పెడదా-నుకున్నాడు. వరదయ్య కూడా "మీరు తిరిగి వచ్చేంత వరకూ మీ సొమ్మును కూడా నా సొమ్ము లాగానే దాచి ఉంచుతాను, దానిదేమున్నది?" అనటంతో, సూరయ్య తన డబ్బునీ, నగల్నీ ఓ సంచిలో పెట్టి, వరదయ్య చేతికి అందించాడు. ఆనక సూరయ్య దంపతులు నిశ్చింతగా కాశీయాత్ర మొదలు పెట్టారు.

అయితే, ఇక్కడ వరదయ్యకు ఆ సంచీని చూడగానే "అమ్మో! చాలా బరువుగా ఉన్నదే, ఎంత సొమ్ము ఉన్నదో!" అనిపించింది. ఎలాగైనా వాటిని కాజెయ్యాలనే దుర్బుద్ధి పుట్టింది. సూరయ్య దంపతులు కాశీకి వెళ్ళిన రెండో రోజునే అతను సంచీని విప్పి చూసి, దానిలోని డబ్బుని, నగల్నీ తీసి తన పెట్టెలో దాచేసుకున్నాడు.

ఆరోజు సాయంత్రం చీకటి పడుతుండగా అతను పెరట్లో ఒక గుంట త్రవ్వాడు. ఆ మట్టిలోంచి రాళ్లన్నిటినీ ఏరి, సూరయ్య సంచీలో వేయటం మొదలు పెట్టాడు. సొమ్ముల మూటకు బదులుగా ఈ మూటని గుంతలో పెడదామని అతని ఆలోచన!




అయితే అతని దురదృష్టమో, ఏమో గానీ, సరిగ్గా అదే సమయానికి అటువైపుగా వెళ్తున్నాడు ఒక గంధర్వుడు. ఆత్రంగా రాళ్ళు ఏరుతున్న వరదయ్యను చూసి గంధర్వుడికి ఆశ్చర్యం వేసింది. కొంచెం సేపు అక్కడే ఆగి, వరదయ్య ఉద్దేశాన్ని, దాన్ని నెరవేర్చుకునేందుకై అతను చేస్తున్న పనిని గమనించాడు. గంధర్వుల శక్తికి అడ్డు ఏమున్నది? వరదయ్య దుష్టబుద్ధి అతనికి వెంటనే తెలిసిపోయింది. దాంతో అతను

నవ్వుకొని, తన శక్తితో ఆ సంచిలోని రాళ్లలో ఒకదాన్ని అత్యంత విలువైన వజ్రంగా మార్చేసాడు. సంగతి తెలీని వరదయ్య సంచిని అంతా పూర్తిగా రాళ్లతో నింపేసి, గోతిలో పడేసాడు!

మెల్లగా మూడు నెలలు గడిచాయి. కాశీ నుండి సూరయ్య దంపతులు తిరిగి వచ్చారు. వరదయ్య ఇంటికి వెళ్ళి తన సొమ్ముల సంచీ అడిగాడు సూరయ్య.

వరదయ్య అతన్ని చూసి సంతోషం నటిస్తూ "ఓహో! తిరిగి వచ్చేసారా, సూరయ్యా?! ప్రయాణం బాగా జరిగిందా? దర్శనాలూ అవీ బాగా ఐనాయా? ఇక్కడ రోజులు ఏమాత్రం బాగుండటం లేదు సూరయ్యా! విన్నావుగా, ఇళ్ళకు కన్నం వేసి దొంగతనం చేసే దొగలు ఎక్కువ అయి పోతున్నారు. అందుకని నువ్విచ్చిన డబ్బునీ, నగల్నీ అన్నిటినీ జాగ్రత్తగా నా పెరడులో పూడ్చి పెట్టాను- నువ్వే తీసుకో, శ్రమ అనుకోకు" అని దూరం నుండే సంచిని పూడ్చిన స్థలం చూపించి, ఇక తను అక్కడ లేకుండా ఇంటిలోకి వెళ్ళిపోయాడు.




అక్కడ త్రవ్విన సూరయ్యకు సంచీ కనబడింది. అతను సంతోషంతో దాన్ని తీసుకుని, వరదయ్యకు ధన్యవాదాలు చెప్పి, ఇంటికి వెళ్ళాక గానీ సంచిని విప్పి చూసుకోలేదు. చూసుకుంటే ఏముంది, అందులో నిండా రాళ్ళు ఉన్నాయి! డబ్బు, బంగారం లేనే లేవు!!

ఇంకేముంది, సూరయ్య లబోదిబో మంటూ పోయి న్యాయస్థానంలో ఫిర్యాదు చేసాడు. సూరయ్య చేతిలోని సంచీని తీసుకుని అందులోని రాళ్ళను తన ముందున్న బల్ల పైన కుమ్మరించాడు న్యాయాధికారి. ఆ

రాళ్ళలో ఒక రాయి ఆయన కంటిని ఆకర్షించింది. దానికి ఏ మూలనో కొంచెం మెరుపు ఉండింది. న్యాయాధికారి ఆ రాయిని కడిగించి, జాగ్రత్తగా పరిశీలించాడు: అది నిఖార్సయిన మేలిమి వజ్రం!

"చూసావా, సూరయ్యా! స్నేహితుడు నిన్ను ఎంత మోసగించాలని చూసినా, నీకు మటుకు మేలే జరిగింది. ఇదిగో, నీ స్నేహితుడు నిన్ను మోసం చెయ్యటం కోసం, తనకు దొరికిన రాయినల్లా సంచీలోకి వేసాడు. అయితే ఆ క్రమంలో అనుకోకుండా చాలా విలువైన వజ్రపు రాయిని కూడా ఒకదాన్ని, సంచీలో వేసి పూడ్చి పెట్టాడు. ఆ ఒక్క వజ్రపు విలువే పది- పదిహేను కిలోల బంగారపు విలువకు సమానం అవుతుంది!" నవ్వుతూ చెప్పాడు న్యాయాధికారి.

సూరయ్య ఆశ్చర్యపోతూనే న్యాయాధికారికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. "పోనీలెండి, మరయితే ఇక వరదయ్యను ఏమీ అనక్కర్లేదు- దేవుడి దయ వల్ల నాకు ఏమీ అన్యాయం జరగలేదు! నిజంగానే నా సర్వస్వం పోయిందని కృంగిపోయాను నేను!" అన్నాడు.

"అదే మనలోని లోపం, సూరయ్యా! మోసం చేసిన వాడిని ఇప్పుడు వదిలేస్తే, వాడు మరొకరిని మోసం చేస్తాడు. దోషిని అట్లా వదిలి పెట్టకూడదు. అతనికి తగిన శిక్ష అతనికి పడాల్సిందే" అని వెంటనే తన గుమాస్తాను పంపి వరదయ్యను పిలిపించాడు న్యాయాధికారి.

"వరదయ్యా! రా! రా! కూర్చో! సూరయ్య డబ్బును అంత చక్కగా, బలే దాచావే! నిజంగా, నీ పెరటి నేలలో బలే మహత్తు ఉందోయ్! మరేం లేదు; నా దగ్గర కొంత బంగారం ఉంది- దాన్ని కూడా కాస్త నీ పెరట్లో పూడ్చిపెడతావా, అది కూడా విలువైన రాయిగా మారుతుంది?" అన్నాడాయన, వరదయ్య రాగానే.

న్యాయాధికారి తనని మెచ్చుకుంటున్నాడో, తిడుతున్నాడో అర్థం కాని వరదయ్య గుటకలు మింగాడు.

"నేను చెప్పేది నిజమే సుమా! చూడు,

నువ్వు సూరయ్య సంచీని తీసుకెళ్ళి మీ పెరట్లో పూడ్చిపెట్టావా? అవి కాస్తా ఇప్పుడు వజ్రాలుగా మారాయి! అందులో ఇదొక్కటే ఇప్పుడు లక్ష వరహాలు చేస్తుంది. నిజం! నమ్మకం చిక్కట్లేదా? చూడు, కావాలంటే. ఎట్లా మెరుస్తున్నదో చూసావా? సాన పడితే అద్భుతంగా అవుతుందిది" అంటూ ఆ వజ్రాన్ని తీసి చూపించాడు న్యాయాధికారి.

"మహాప్రభో! సూరయ్య సొమ్ములన్నీ నా తిజోరీలో భద్రంగా ఉన్నాయి. అతను తమరికి చూపించాడే, ఆ సంచీలోని సామాను అంతా పూర్తిగా నాదే. నా పెరడులో దొరికిన వజ్రాలన్నీ కూడా, మరి నావే అవుతాయి కదా..?!" అని తన దుష్ట బుద్ధిని మరో మారు చూపించాడు వరదయ్య.

"నోర్ముయ్! నిన్ను నమ్మి, నీ స్నేహితుడు ఒకడు తను చెమటోడ్చి సంపాదించిన ధనాన్ని కొంతకాలం దాచి పెట్టమని నీచేతికి ఇచ్చి వెళ్తే, దాన్ని మ్రింగేసేందుకు పథకాలు రచించావు. సొమ్ముల స్థానంలో రాళ్ళు వేసి అతనిని మోసం చేశావు. అతని అదృష్టం కొద్దీ ఆ రాళ్ళలో ఒకటి విలువైన వజ్రం అయ్యింది.




ఆ సంగతి తెలియగానే ప్లేటు ఫిరాయిస్తావా? నీకు తగిన శాస్తి జరగాలి. నీ పాడుబుద్ధిని వ్యక్తం చేసుకున్నావు. మర్యాదగా సూరయ్య డబ్బు, నగలు తెచ్చి ఇవ్వు. ఆ తర్వాత నిన్ను తీరిగ్గా విచారించి, నీ ఆస్తులన్నీ జప్తు చేసుకొని, సంవత్సరం పాటు నిన్ను కారాగారంలో పెట్టిస్తాను నేను!" చెప్పాడు న్యాయాధికారి కఠినంగా.

"క్షమించండి, బుద్ధి గడ్డి తిని, తప్పు చేశాను!

సూరయ్య సొమ్ములు సూరయ్యకు తెచ్చి ఇస్తాను" అని పశ్చాత్తాపపడి, సూరయ్య సొమ్మును సూరయ్యకు అప్పచెప్పాడు వరదయ్య: "నాకు బుద్ధి వచ్చింది. నన్ను వదిలెయ్యండి చాలు. ఆ వజ్రాలూ వైడూర్యాలూ ఏమీ నాకు అవసరం లేదు. వాటిని మీరు కావాలంటే సూరయ్యకు ఇవ్వండి, లేదా తమరికి తోచిన విధంగా గ్రామాభివృద్ధికై ఉపయోగించండి. నేను మటుకు చాలా మారిపోయాను. ఇకపై ఎన్నడూ దురాశను దరి చేరనీయను" అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ లెంపలు వేసుకున్నాడు.

"నా సొమ్ములు నాకు దొరికాయి, అదే చాలు. అయ్యా! ఆ వజ్రాన్ని ఇతను అన్నట్లు గ్రామాభివృద్ధికై వినియోగించండి. అదే సబబుగా ఉంటుంది. తమరికి వీలైతే ఈ వరదయ్యను క్షమించండి" అన్నాడు సూరయ్య సంతోషంగా.

సూరయ్యకు న్యాయం జరిగినందుకు, వరదయ్య మనసు మారినందుకు, గ్రామాభివృద్ధికి నిధులు ఏర్పడ్డందుకు సంతోషిస్తూ ఆకాశంనుండి వానజల్లులు కురిపించాడు గంధర్వుడు.

●

1. దక్షిణభారతదేశంలో వరిని అత్యధికంగా పండించే రాష్ట్రం ఏది? జ. ఆంధ్ర ప్రదేశ్
2. రబ్బరును అత్యధికంగాఉత్పత్తి చేస్తున్న రాష్ట్రం ఏది? జ. కేరళ
3. జాతీయ పొగాకు బోర్డు ఎక్కడ ఉన్నది? జ. గుంటూరు
4. భారతదేశంలోని ఎత్తయిన కాంక్రీట్ డ్యాం ఏది? జ. నాగార్జున సాగర్
5. కోసి ప్రాజెక్ట్ ఏ రాష్ట్రంలో ఉంది? జ. బీహార్
6. రవీంద్ర సంగీతం ఏ రాష్ట్రానికి గర్వకారణం? జ. పశ్చిమ బెంగాల్
7. సర్దార్ సరోవర్ డ్యాం ఏ నది మీద కట్టబడింది? జ. నర్మదా నది






# పరివర్తన

బౌద్ధ కథ

*దొంగ కూడా మనిషే. అతనిలో ఉన్నది కూడా మనసే. నిరంతరం మార్పు చెందటం మనసు ధర్మం...*
*మూలం : పాల్ రెప్స్ " జెన్ ఫ్లెష్ -జెన్ బోన్స్ "*

అనగనగా, చాలా కాలం క్రితం జపాన్ దేశంలో 'షిచిరి కోజున్' అనే గొప్ప బౌద్ధ అధ్యాపకుడు ఒకాయన ఉండేవాడు. "షిచిరి బాగా చదువుకున్నవాడు; బౌద్ధ తత్వాన్ని లోతుగా అర్థం చేసుకున్నవాడు" అని చెబుతారు. అనేక మందిని ధర్మమార్గంలో నడిపిన షిచిరికి, జపాన్ దేశం అంతటా శిష్యులు ఉండేవాళ్ళు.

ఎంత గొప్పవాడైనా, షిచిరి అందరు భిక్షువుల మాదిరి అతి సాధారణంగా జీవించేవాడు. ఏకవస్త్రం ధరించి, గుండు చేసుకొని, ఒంటరిగా ఒక గుడిసెలో నివసించేవాడు. ఆయన నడిపే గురుకులానికి వచ్చే విరాళాలకు సంబంధించిన గల్లాపెట్టె ఒకటి, ఆ గదిలోనే ఒక మూలగా ఉండేది.

ఒక రోజు సాయంత్రం అవుతుండగా షిచిరి

కళ్ళు మూసుకొని తను రోజూ వల్లించే ధర్మసూత్రాలు అన్నింటినీ బిగ్గరగా వల్లిస్తూ ఉన్నాడు. ఆ సమయంలో అకస్మాత్తుగా దొంగవాడు ఒకడు ఆయన ఉండే గదిలోకి ప్రవేశించాడు:



"మర్యాదగా నీ దగ్గర ఉన్నది అంతా ఇచ్చేయ్- డబ్బులు, నగలు- ఏవి ఉంటే అవి! మర్యాదగా ఇచ్చేస్తావా, ప్రాణాలు తీయమంటావా?" అంటూ పదునైన కత్తిని షిచిరి గొంతుకు ఆనించాడు దొంగ.

ధర్మంలో ఉన్నత శిఖరాలను అంది పుచ్చుకున్న గురువు షిచిరి. ఆయనకు దొంగంటే ఏ మాత్రం భయం వెయ్యలేదు. పైపెచ్చు ఎక్కడ లేని చికాకూ పుట్టుకొచ్చింది: "ఇదిగో అబ్బాయ్! నువ్వు నన్ను ఊరికే డిస్టర్బు చేస్తున్నావు! డబ్బులు కావాలంటే అదిగో, నా వెనకాల ఆ గల్లాపెట్టెలో ఉన్నాయి. పోయి తీసుకొచ్చుకో. మాటల్ని ఊరికే వృథా చేసుకోకు" అంటూ అటువైపు చూపించాడు- "విను నాయనా! అన్నీ వెతుక్కో, ఏవి కావాలంటే అవి తీసుకో. ఊరికే నన్ను కష్టపెట్టమాకు. ఇక్కడ అందరూ ఎవరి పనులు వాళ్లు చేసుకుంటారు" అంటూ మళ్ళీ తను సూత్రాలు వల్లించటంలో మునిగి పోయాడు.

దొంగవాడు కొంచెం అనుమానంగానే గల్లాపెట్టె వైపుకు నడిచాడు. 'షిచిరి ఎక్కడ పారిపోతాడో' అన్నట్లు వెనక్కి వెనక్కి తిరిగి చూసుకుంటూ పోయాడు. చివరికి గల్లాపెట్టెలోని డబ్బుని ముట్టుకొని చూసుకునేవరకూ అతని మనసు మనసులో లేదు. ఒకసారి ఆ మొత్తం అతని చేతికి తగిలాక, అప్పుడు వాడు ఊపిరి పీల్చుకొని ఆ డబ్బు మొత్తాన్నీ తను తెచ్చుకున్న

మూటలోకి వేసుకోబోయాడు-

అంతలో అకస్మాతుగా షిచిరి గొంతు వినపడింది: "ఓయ్, హలో! అక్కడ ఉన్నది మొత్తం తీసుకోవద్దమ్మా, దయచేసి! రేపు నేను కొంచెం పన్నులు అవీ కట్టేది ఉన్నది- అక్కడున్న వాటిలో కాసిన్ని డబ్బులు అట్లాగే మిగిల్చి ఉంచావంటే, రేపు ఆ పన్నులను కట్టే బెడద కూడా వదిలిపోతుంది నాకు!" అని.

దొంగకు ఒక్క క్షణం ఏమీ అర్థం కాలేదు- "వీడేంటి?! ఏదో వింతగా ఉన్నాడే!" అనుకున్నాడు. "సరే, కానీలే, ఏం పోతుంది?!" అన్నట్లు గల్లాపెట్టెలో డబ్బుల్ని కొన్నిటిని మటుకు వదిలేసి, మిగతాదంతా సంచిలో వేసుకున్నాడు: "సరేలే. నువ్వు చెప్పినట్లు కొన్ని డబ్బులు ఆ డబ్బాలోనే వదిలేసాను" అంటూ.

"థాంక్యూ! నువ్వు చాలా మంచివాడివల్లే ఉన్నావు" అన్నాడు షిచిరి, మంత్రాల మధ్యలోంచే.

దొంగవాడు వెనక్కి తిరిగి పోబోయాడు- అయితే అతను ఇంకా గడప దాటకనే వెనకనుండి షిచిరి గొంతు వినిపించింది గట్టిగా:

"హలో! నువ్వు నా డబ్బులు తీసుకున్నావు; కనీసం థాంక్స్ కూడా చెప్పిపోవట్లేదు! అంత అమర్యాద దేనికి, కొంచెం థాంక్స్ చెప్పి పోతే నీకేం పోతుంది?!" అని.




ఈసారి దొంగ ఉలిక్కి పడ్డాడు.

కొంచెం ఆశ్చర్యం తోటి, మరికొంత భయం తోటీ షిచిరినే చూస్తూ నిలబడ్డాడు. సగం లోపల, సగం బయట నిలబడ్డ అతని శరీరాన్ని స్పృశిస్తూ ఎక్కడినుండో గాలి చల్లగా వీచింది. తను కూర్చున్న చోటు

నుండి కదల్లేదు షిచిరి. ఆయన కళ్ళు మాత్రం చిలిపిగా మెరుస్తూ దొంగ కేసి చూసాయి.

ఎందుకనో దొంగ వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చినట్లయింది. తెలీని భయమేదో వాడిని ముంచెత్తింది. అయితే రెండో క్షణానికి తేరుకున్నాడు వాడు. "థాంక్స్" అని పొడిగా, రెండు ముక్కల్లో చెప్పేసి, తను నింపుకున్న మూటతో ఇక వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు.

ఆ తరువాత వాడు తన స్నేహితులకు ఈ సంగతంతా చెప్పాడు- "ఆ క్షణంలో నాకు ఆ మనిషి అంటే ఎందుకనో, తెలీని భయం వేసింది. ఇంతమంది జనాలలో ఏనాడూ- ఎవ్వరినీ- చివరికి పోలీసుల్ని- చూసి కూడా నేను అంతగా భయపడలేదు. నిజం!" అని.

అయితే ఇంకో వారం గడవకనే మరో చోట దొంగతనం చేస్తూ పట్టుబడి పోయాడు ఆ దొంగ. పోలీసులు వాడిని పట్టుకెళ్ళి, వాడు గతంలో -ఎక్కడెక్కడ- ఎంతెంత మొత్తాలు- దోచుకున్నాడో, ఆ వివరాలన్నీ కక్కించారు. మొట్ట మొదట్లోనే దొంగ 'షిచిరి కోజోన్' పేరు చెప్పాడు; ఆయన నుండి ఎంత దోచుకున్నాడో చెప్పాడు. వివరాలు అన్నీ రాసుకున్నాక, పోలీసులు వాడిని కోర్టులో హాజరు పరిచారు.




కోర్టువారు షిచిరిని పిలిచి, సాక్ష్యం చెప్పమన్నారు: "వీడు మీ నుండి ఇంత సొమ్ము దోచుకున్నానని చెబుతున్నాడు. నిజమేనా?" అని అడిగారు.

షిచిరి దొంగకేసి చూస్తూ ప్రశాంతంగా చెప్పాడు: "నిజానికి ఇతను నానుండి ఏదీ

దోచుకోలేదు. ఆ డబ్బుల్ని నేనే తీసుకొమ్మన్నాను అతన్ని" అని. ఆ వెంటనే ఉత్సాహంతో మెరిసే కళ్ళతో చెప్పాడాయన- "డబ్బులు తీసుకొని వెళ్తూ ఇతను నాకు థాంక్స్ కూడా చెప్పాడు!" అని.




అయినా, తను చేసిన ఇతర నేరాలకుగాను దొంగకి కొన్నేళ్ళపాటు జైలు శిక్ష పడింది. జైల్లో ఉన్నంతకాలమూ ఎందుకనో, దొంగ షిచిరిని మర్చిపోలేకపోయాడు. నిజానికి షిచిరిని, ఆయన మాటల్ని గుర్తు చేసుకోని రోజే లేకుండింది అతనికి!

సంవత్సరాలు గడిచాక, షిచిరి ఇంకా ముసలివాడైన తరుణంలో- ఎవరో ఆయన ఇంటి తలుపు తట్టారు. తలుపు తెరిచి చూస్తే ఎదురుగా నిలబడి ఉన్నాడు, ఆ దొంగ! అప్పుడే జైలులో నుంచి బయటకు వచ్చినట్లున్నాడు- భుజానికి వ్రేలాడుతూ ఒక చిన్న బట్టల మూట. పెరిగిన వయస్సు; కళ్ళనిండా నీళ్ళు.

"ఆహా! వచ్చావా! నువ్వు ఇంకా రాలేదే అనుకుంటూన్నాను" నవ్వాడు షిచిరి "రా! రా! లోపలికి రా!" అని తలుపు తెరుస్తూ; ఒకనాడు దొంగగా తనను కత్తి చూపించి బెదిరించిన ఆ వ్యక్తిని మనస్పూర్తిగా తిరిగి ఇంటిలోనికి ఆహ్వానిస్తూ.

మారిపోయిన ఆ దొంగ షిచిరి సాహచర్యంలో తన జీవితాన్ని సార్థకం చేసుకున్నాడు.

మీకు తెలుసా, మొదటిసారిగా పేపర్‌ను రూపొందించినది ఎవరు? చైనా వారు, క్రీ.శ. 105లో.

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**కుందేలు, రంగయ్య, హృదయం, వినాయకుడు, ఉద్యోగం, ఉపాధ్యాయుడు, అత్యాశ, సంవత్సరం, రాక్షసులు, అపార్థం, సింహం, సాయంత్రం, బహుమతి, బిచ్చగాడు, నిజాయితీ, రైతు, బంగారు బిందె, స్వాగతం, సముద్రం, రాముడు, పిల్లలు** -*ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తి | ని | కుం | దె | మ | స | హృ | ఉ | ద్యో | గం | గా | రై |
| హృ | జా | సం | దే | శ | ము | యు | పా | బం | తి | తు | తు |
| పా | రా | క్ష | సు | లు | ద్రం | పా | ధ్యా | స | చ్చ | రం | త్స |
| బి | బ | రం | సా | యి | డు | గా | యు | తి | త్యా | ద | స్వ |
| సిం | చ్చ | ని | దె | గం | రా | ము | డు | కు | య | నా | వి |
| ప | రం | గా | రా | తు | సం | గా | హు | మ | చ్చ | పా | దె |
| స్వ | గ | తం | డు | వ | ని | ర్థం | సా | త్రం | ద | బిం | హు |
| ర్థం | య్య | క్ష | త్స | యి | జా | పా | సిం | హం | రు | శ | తి |
| యు | నా | రం | వి | బ | యి | రం | హ | గా | డు | మ | ము |
| త్రం | వి | పా | లు | కు | తి | శ | బం | తు | హు | వి | యి |
| యం | హృ | ద | యం | వ | డు | త్యా | బ | బ | గా | లు | రం |
| సా | య్య | శ | సా | ర్గం | పా | అ | పా | తి | బం | గా | తు |

# పదరంగం-95

*నిర్వహణ : డా. సిరి, మిర్యాల గూడ, నల్గొండ జిల్లా.*




1.'అ' అచ్చుయితే, 'క' ని ఏమంటాం? (2)
2. 'పెళ్ళి' ని ఇలా కూడా అంటాం (4)
3. ఘోరమైన నీళ్ల విరేచనాల రోగం (3)
4. 'గుర్రం' ఇంకో పేరు (3)
5. దేవతల గురువు (4)
7. తిరగబడిన కుండ (2)
8. 'కాళ్లు' కి ఏకవచనం (2)

నిలువు

1. ఇంద్రధనస్సుకి మరో పేరు (4)
4. 'అలలు'కి ఏకవచనం (2)
5. తంజావూరులో ఉన్న ప్రసిద్ధ దేవాలయం చివర తెగిపోయింది (5)
6. 'దప్పిక' మరోలా (3)
9. 'మర్కటం' వాడుక భాషలో (2)
10. చందమామలో ఈ జంతువు కనిపిస్తుందంట! (3)

అడ్డం

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి.
నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.
సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 97 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా ఇప్పుడు కొత్తపల్లికై డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్! రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్! ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!



**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 11 | 11 | 220 |
| 2 | 2012 Set | 12 | 12 | 240 |
| 3 | 2013 Set | 7 | 3 | 175 |
| 4 | 2014 Set | 10 | 403 | 250 |
| 5 | 2015 Set | 7 | 914 | 175 |
| 6 | 2016 Set | 8 | 1178 | 200 |
| 7 | 2017 Set | 7 | 1455 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

BCI

KRSA101M125

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 08/12/2017 Postal Regn No: HDP/008/2015-2017

మార్కులా, కథలా?

సుబ్బారావు వచ్చాడు "ఇదిగో, ప్రపంచమంతా 'ర్యాంకులు కావాలి, మార్కులు కావాలి' అని తన్నుకులాడు-తుంటే, మీరు ఇట్లా 'కథలు, జోకులు, పాటలు' అని పంతం పట్టుకొని కూర్చోటం బాలేదు" అంటూ.

నేను నవ్వాను. "గుర్తుపట్టావే, మొత్తానికి?!" అన్నాను.

"ఆ మాత్రం తెలుస్తూనే ఉందిలే. అయినా మీ కొత్తపల్లి వాళ్లకి చదువులు కావాలా-అక్కర్లేదా, ముందు ఆ సంగతి తేల్చు, ఇవాళ్ల" అన్నాడు సుబ్బారావు కూర్చుంటూ.

"చూడు సుబ్బారావూ, అర్థం చేసుకో: కథల్లో మనసుకి హాయినిచ్చే గుణం ఉంటుంది. అవి పిల్లల్ని నవ్విస్తాయి; వాళ్లని మెచ్చుకుంటాయి; వాళ్లకు రకరకాల సంగతులు నేర్పిస్తాయి; ఎట్లా ఉంటే మంచిదో చెబుతాయి; జీవితం పట్ల ఆశనీ, భవిష్యత్తు పట్ల ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. అట్లాంటివి చదవకపోతే, పిల్లలు తొందరగా ముసలివాళ్ళు అయిపోతారు. నవ్వటం, సంతోషపడటం మరచిపోతారు. నిరాశావాదులు అయిపోతారు. అది ఏం మేలు, చెప్పు?" అన్నాను అనునయంగా.

"అవునులే, రోజంతా పనిచేసాక ఓ కథ చదివితే నాకు కూడా ప్రాణం లేచివచ్చినట్లనిపిస్తుంది. అయినా చదువుకోవాల్సిన పిల్లలు వీటిలో పడితే వాళ్లకి టైం వేస్టు కాదూ?"

"ఇరవై నాలుగు గంటలూ పని చేస్తే ఇంజన్లు వేడెక్కిపోతాయిరా బాబూ! మెదడుల పనితీరుని అర్థం చేసుకోవాలి; వాటికి సేదతీరే సమయం దొరికేట్లు చేయాలి. రిలాక్స్ అయిన మెదళ్లే కదా అద్భుతాలు సృష్టించేది?! ఆట పాటలు, కళలు, సాహిత్యం- ఇవన్నీ మనసుని చల్లబరుస్తాయి. క్రొత్త ఊపిరి పోసి, అంతరంగాల్ని ప్రాణశక్తితో నింపుతాయి"

“నువ్వు ఏదేదో చెబుతావు- అంతేలే" అన్నాడు సుబ్బారావు నిస్సహాయంగా.

"ఇదిగో, నువ్వు నసుగుతూనే ఉంటావుగానీ.. ఇదొక్కటీ చెప్పు- మీవాడి ముఖం కొత్తపల్లిని చూడగానే వెలుగుతుందా, లేదా?" చివరి అస్త్రం ప్రయోగించాను నేను.

కొడుకు ముఖం గుర్తుకొచ్చిన సుబ్బారావు సంతోషంగా నవ్వాడు.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.

BC



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M125** |
| పుస్తకం పేరు | కొత్తపల్లి |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |